

# అదే పతాక
# అదే శంఖారావం
# అదే స్వాతంత్ర్యం

ఈశతాబ్దివారం - ముఖ్యం - యీ తరము వారము - ధన్యులము. మన జీవితము పునీతమైనది. మనజన్మ సఫలతనొందినది.

తరతరముల బానిసత్వమునుంచి బయటపడినాము. తరతరాల తలవంపులు దూరము చేసుకొన్నాము. మనము స్వతంత్రులము. మనవంటి భాగ్యశాలురు మరిలేరు.

మన పతాకప్రతిష్ఠ మనప్రతిష్ఠ. దాని ఛాయను భారతజాతి ముందునకు అడుగువేస్తుంది; జగతిజాతులతో సమానంగా ప్రముఖ సమస్యలను పరిష్కరిస్తుంది.

లోధ్ర, అమృత, అర్కలతో భారతజాతిని సర్వకాల సర్వావస్థలలోను సేవిస్తూవుండే కేసరికుటీరం లిమిటెడ్ ఈ మహోత్సవ సమయంలో శతకోటి శుభకాంక్షలను వెలువరించకుండ వుండలేదు.

వందేమాతరం. జయ్ హింద్

కేసరికుటీరం లిమిటెడ్. రాయపేట. మద్రాసు.

స్వాతంత్ర్య సంచిక

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు :
డాక్టరు కే. యస్. కేసరి

సంపుటము ౧౯]  ఆగస్టు 1947  [సంచిక ౮



## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయువలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిపైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




జయజయగృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# జాతీయపతాకమే స్వాతంత్ర్యచిహ్నము.

ఏజాతికైనా, ఏదేశానికైనా జాతీయపతాకమే స్వాతంత్ర్యచిహ్నము. పతాకస్వాతంత్ర్యాలు అవినాభావ సంబంధంకలవి; పూవు తావి లాంటివి. నేడు భారతదేశానికొక జాతీయపతాకం సర్వజనాంగీకృతమైనది, రాజ్యాధికారభూయిష్టమైనది, ఏర్పడ్డది కావుననే భారతీయులు ఈ ఆగస్టు 15 వ తేదీన స్వాతంత్ర్యము సిద్ధించినదని ఉవ్విళ్లూరుతూ ఉత్సవాలు ఊరేగింపులు చేసుకుంటున్నారు.

ఈ పతాకం తేరగా లభించలేదు. స్వాతంత్ర్యపిపాసులైన స్త్రీలూ పురుషులూ ఎందరో త్యాగసాహసాలొనర్చి దీక్షతో శ్రద్ధతో పలుకార్యకలాపాలు గావించి, పాటుబడగా నేడది లభ్యమైంది.

ఒక రక్తబిందువైనా, ఇతరులది, చిందించకుండా మనమీ పతాకాన్ని బడసినామని కొందరనవచ్చు. సాయుధులై పౌరుషంతో పలుసాహసాలొనర్చిన విప్లవకారుల కృషిఫలితాలు కూడా ఈ పతాకలబ్ధికి మూలకారణంలో చేరలేదనేటంత అహంకారులా సత్యాగ్రహులు? వారీ 27 సం॥ లనుంచీ, భారతస్వాతంత్ర్యలక్ష్మికి నిజరక్తధారలవారులు పోసి సేవించి, ఈపతాకాన్ని సృష్టించారన్నమాట వాస్తవమే. అయితే ఝాన్సి లక్ష్మీబాయి, నానాసాహేబ్, తాంతియాతోపే, ఫడకే, వీరసావర్కర్, కుదీరాంబోస్,

గోపీనాథషా, అల్లూరి సీతారామరాజు, భగత్ సింగ్, శాంతిఘోష్ కన్య, సునీతి చౌదరి కన్య, నేతాజీ మొదలు.గాగల వీరసాహసికుల దివ్యచారిత్రములు ఆ పతాకధ్వజమునకు రత్నాలకళ్లై మిరుమిట్లు గొలుపు దీప్తుల వెదజల్లుతున్నవనుటయు నిర్వివాదాంశము. వారికి, వారికి భావిభారతసంతానములు నిరంతరము కృతజ్ఞులైయుంటారు. గృహలక్ష్ములు పరంపరగా తమ శిశువులకు వీరి వీరగాథల నభివర్ణించి చెప్తారు.

ఈపతాకమం దమరిన తెలుపు, ఆకుపసుపు, పంగపండుచాయలు క్రమంగా తేజము, సత్యము, నిరాడంబరత్వములను, సశ్యశ్యామలమై జీవనప్రదాతయైన భూదేవితో మనకుగల బాంధవ్యమును, త్యాగవినయములను వ్యక్తీకరిస్తున్నవి. పతాకమధ్యస్థమున ఇన్నాళ్లుఉంటూ వచ్చినరాట్నంస్థానే, అశోకుని సారనాథ్ స్థూపమందలి ధర్మచక్రము చిత్రింపబడినది. రాట్నం యొక్క ప్రాశస్త్యం ఎవ్వరూకాదనరు. అయితే అశోకునిధర్మచక్రం అంతకన్నా ఉదాత్తమైన, సత్య, ధర్మ, శీలము, లనే మేలిగుణముల ప్రచారమొనర్చునది. కావున నీపతాకం ఆటంబాంబు రహస్యాలతో, మరోఘోరయుద్ధపు గుసగుసలతో, క్రిందుమీదులవుతూన్న ప్రపంచానికి, అందైదోభాగం జనాభాగల భారతదేశం, ప్రపంచకళ్యాణార్థమై, తానాచరించి, ఇతరదేశములకు ఉపదేశింపగల ఉత్తమశాంతిధర్మమును నిరూపించుచున్నది.

శ్రీ సర్. రాధాకృష్ణన్ గారు ఈ పతాకాన్ని ఆమోదిస్తూ ఢిల్లీలో రాజ్యాంగచట్ట సభ యందిట్లా అన్నారు: "పతాకం ఐక్యతకు, స్వాతంత్ర్యానికి చిహ్నమైనిలుచును. అయితే మనమీరెంటిపట్ల, కొంత కొంత లోపమైనా, సమాధాన పడ్డాము." అనాదినుంచీ ఉన్న అఖండ హిందూస్థానము విభాజ్యం కావడమూ, నేటికి సంప్రాప్తమైనది డొమినియన్ స్టేటసే కావడమూ కారణంగా శ్రీరాధాకృష్ణన్ గారన్నమాట అక్షరాల నిజమే. కాని క్రమంగా శక్తియుక్తులను చూపగలమేని, ఈ పతాకంక్రిందనే ఆ లోపాలను సవరించుకోవడానికి సంపూర్ణావకాశం లేకపోలేదు.

ఇల్లలకగానే పండుగకాలేదని గృహలక్ష్మికి చెప్పనవసరంలేదు. చేకూరిన స్వాతంత్ర్యం సుఖసంపదలకు, శాంతి సౌఖ్యాలకు, శాశ్వతానందానికి ఆస్పదం కావాలంటే, ఈ పతాకంక్రింద ఎంతో నిర్మాణాత్మకమైన కార్యకలాపం జరుగవలసియున్నది. అందులో స్త్రీలుపూర్తిగా పురుషులకు సహకారులుకానిదే నెరవేరదు. కళలూ శాస్త్రాలు, విద్యలూ, వినోదాలు, వృత్తులూ పరిశ్రమలు, పరిపాలనాశక్తి సామర్థ్యాలు మొదలైన వన్నీ

పెంపొందించి మనస్వాతంత్ర్యం చిరస్థాయి కావలెనంటే, తేజ ఓజోబలసంపన్నులైనవారిని కని, తెల్వితో పెంచిపెద్దవారి నొనర్ప వలసిన బాధ్యత గృహలక్ష్ములైన తల్లులదే. మరి ఈపతాకం భారతనారీమణుల జాతీయాభిమానజన్యమని శ్రీమతి సరోజినీదేవిగారన్నారు. "దానిని సుస్థిరంగా కాపాడవలసిన ఉత్తమ వీరులను, స్త్రీపురుషులను సహా, - రుద్రమదేవి, ఖడ్గ తిక్కన్నలవంటివారలను కని పెంచవలసిన బాధ్యతకూడా వీరమాతలైన గృహలక్ష్ములదే.

కావున భారతీయ గృహలక్ష్మీకటాక్షమున నీజాతీయస్వాతంత్ర్యపతాకము క్రింద భవిష్యద్భారత సంతానములు అభ్యుదయపరంపరల నవిచ్ఛిన్నముగా పొందుదురుగాక.

స్వాతంత్ర్యసిద్ధి నింత త్వరితమొనర్చిన గాంధీజీ నాయకత్వమునకు జోహారులు.



# గౌరవనీయులు శ్రీ జస్టిస్ ప్రత్తిపాటి   సత్యనారాయణరావు పంతులుగారు.

కేసరీ హైస్కూలు, మా "గృహలక్ష్మి"కి సోదరసంస్థ. ఆ సంస్థపాలక వర్గసభ్యులలో శ్రీ సోమయ్యగారు అప్పటికే హైకోర్టు జడ్జీగా నుండిరి. ఆపిదప మరొకసభ్యులు కోశాధిపతులు శ్రీ వింజమూరి గోవిందరాజాచారిగారు పిదప హైకోర్టు జడ్జీపదవి వహించినారు. ఇప్పుడింకొకసభ్యులు శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు పంతులుగారు కూడా హైకోర్టు జడ్జీపదవి నలంకరించినందులకు మా సంతసమునకు మేరలేదు. శ్రీ సత్యనారాయణరావు పంతులుగారు ఈసంస్థకు మొదటినుంచీ అండగా నుండినవారు. పూర్వావస్థలో - దీని పాలకవర్గమున కధ్యక్షులుగా నుండినవారు. ఇట్టి మహనీయుల పరిపాలనలో నున్న "కేసరీ హైస్కూలు" ధన్యజీవి; శ్రీ పంతులవారికి దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను "గృహలక్ష్మి" ఆశించుచున్నది.

## ఘనత వహించిన

## శ్రీమతి ముత్యాల సరోజినీదేవి గారు.



లక్ష్మీ సమానురాలైన శ్రీమతి ముత్యాల సరోజినీదేవిగారు సంయుక్త పరగణాలకు గవర్నరు పదవిని తాత్కాలికముగా నలంకరింప నిర్ణయింప బడుటచే— భారత దేశమునకు స్వతంత్రముతో పాటు, భారత నారీలోకమునకు స్వాతంత్ర్యము చేకూరినదని మేము మిక్కిలిగా హర్షించుచున్నాము. మాకుహా తెలిసినదాది— భారత మహిళా ప్రపంచమున నెంతటి మార్పుకలిగినది!- "ఆడది, గడప దాటరాదు- వంటయింట, పడమటింట ప్రమగ్గవలసినదే" అన్న ఆచారమునుండి, ఒక స్త్రీ మంత్రిణి, వేరొకస్త్రీ విదేశములందు రాయబారి, మరొక్క స్త్రీ - ఒక రాష్ట్రమునకు గవర్నరు, అన్నమాటలు పుట్టినవిగదా! విద్వాంసురాలు, కళావేత్త, కవయిత్రి, రాజనీతి చతుర, ధైర్యసాహసోపేత — ఆమె కేమిటలోటు - అన్నివిధముల మిగత పురుషులకన్న మిన్నగానే, ఈపదవి కంతేని తగియున్నది. ఆపదవిచే ఆమెకన్నా, ఆపదవియే ఆమెవల్ల-శోభించ గలదు. ఆమెను తాత్కాలిక గవర్నరుగా గాక శాశ్వత గవర్నరుగా నేలచేయు రైరనియే, మా ఆగ్రహము.

ఆంధ్రు డొక్కడు నీపదవుల నొక్కటైన పొందలేదే - యని ఆంధ్రుల కొక్క కొరత ఉన్నది. ఆ కొరత నీమె కొంతవరకు తీర్చినదని మా విశ్వాసము. ఆమెఎంతటి తెలుగు ఇల్లాలో — ఆమె మాటలలోనే వేరొకచో తెల్పియున్నాము. అయితే మాదొక్క కోరికగలదు. ఆమెను యు. పి. గవర్నరుపదవి చాలించుకొను నాటికి మద్రాసు గవర్నరుగా నియమింతురుగాక యని మాహృదయపూర్వకమగు అభిలాష. ఈశ్వరి శ్రీమతి సరోజినీ దేవిగారికి దీర్ఘాయు రారోగ్యైశ్వర్య సౌభాగ్యముల నొసంగుగాక. ఈ శుభసమయమున శ్రీ మేజరు ముత్యాల గోవిందరాజుల నాయుడుగారికిని మా అభినందనము లంపుచున్నాము.

"వంగదేశానికి పోతే 'మాయింటి ఆడబడుచువు' అని, ఆంధ్రదేశం వస్తే 'మాయింటి కోడలి' వని నన్నంటారు. కాని ఈ రెండు భాషలలోనూ విశదముగా చక్కగా మాట్లాడలేను. అయితే పుట్టింటి భాష, అత్తింటిభాష రెండూ అర్థం చేసుకోగలను."



"ఆంధ్రులము అనుకొనుటయేగాక, విశాల భారతమొకటి యున్నదనికూడా ఆంధ్రమహిళలు ఎంతమాత్రం మరువవద్దు. ఆంధ్రమహిళల అభ్యుదయముతో గాక — ఇరుగు పొరుగువారి అభ్యుదయమునూ, యావద్భారత కళ్యాణమునూ, మహిళల క్షేమమును విశాలమనసుతో సంపాదించుకోవలెను."



"నేను తెలంగాణావాసిని నిజమైన తెలంగాణము మాదే; మీది తెలంగాణా ప్రవాసమే. అచట శిల్పాలూ, శాసనాలు అసమానమైనవి."

ఒకసారి ఒక సభలో ఆంధ్రులకు ఆమెను పరిచయపరుస్తూ ఉత్సాహవంతుడైన వొక ఆంధ్రసోదరుడు "ఆమె మనమనిషి. ఏమంటే, ఆమె ఆంధ్రులకు వివాహిత అయినది" అన్నాడట! పరిహాస మెరిగిన ప్రౌఢ యగుటచే, ఆమె లేచినవ్వుతూ "నేను ఆంధ్రులనందరినీ పెండ్లాడలేదు. నాకు నచ్చిన ఒక్క ఆంధ్రునే పెళ్లాడినాను" అని అందరినీ నవ్వించేసింది.




ఆదర్శగృహం.

# స్వాతంత్ర్యగీతి

శ్రీమతి చదలువాడ నాగరత్నముగారు. పరసత్యల్లూరు.

గాంధి నెహ్రూ మొదల్గాఁగల దేశ
నాయకు లదె త్రివర్ణ పతాకములు
దాల్చి యావద్భారతము నేలుచుండ్రు
పాడవే గృహలక్ష్మి! స్వాతంత్ర్య గీతి.

స్వాతంత్ర్యహోమాగ్ని సంతోషపఱుపఁ
ప్రాణేంధనమ్ము లర్పణము గావించి
ధ్రువ తార లైరి యోధులు – సహోదరులు
పాడవే గృహలక్ష్మి! స్వాతంత్ర్య గీతి.

కుల మతద్వేష భావుల సమైక్యమ్ము
సతము పెంపొందు నీక్ష్మాతలం బందు
ఉన్న తోన్నత భారతోర్వి యాఁగాత!
పాడవే గృహలక్ష్మి! స్వాతంత్ర్య గీతి.



# భారత జాతీయ పతాకం

## భారత నారీమణుల జాతీయాభిమాన జన్యము

భారత జాతీయపతాకము నంగీకరించు పట్ల, రాజ్యాంగ చట్టనిర్మాణ సభలో శ్రీమతి సరోజినీ దేవిగారిట్లు చెప్పియుండిరి:—

విదేశాలలో పర్యటనం చేసేటప్పుడు - మనకొక జాతీయపతాకం లేకపోయినందుకు నాకు ఎంతో సిగ్గు, చింత కలిగేది.

వర్సైల్స్‌సంధి అయినతర్వాత న్యూయార్క్ పట్నంలో జరిగిన ఒక శాంతియుత్సవంలో నన్ను ప్రసంగించ మన్నారు. 44 దేశాల పతాకా లక్కడ ఆ సభలో అల్లనల్లన ఆడుతున్నాయి. స్వతంత్ర దేశాలకు చెందిన ఆజండా లన్నిటినీ, ఒక్కసారి చూచాను. ఎంతో సిగ్గుతో చిన్నబుచ్చుకొని నేనిట్లా అన్నాను:

"స్వతంత్ర రాజ్యాలు సమకూడిన ఈ మహా సమావేశంలో - భారత జాతీయపతాకం - ప్రపంచము లోకెల్లా మిక్కిలి చరిత్రాత్మకమైన పతాకం - నా కంటికి కరవైంది కదా."

మరొక సమయంలో బెర్లిన్ పట్నంలో జరిగిన ఒక అంతర్జాతీయ సభకు 42 దేశాలు తమ స్త్రీ ప్రతినిధుల నంపాయి. వివిధదేశాల పతాకాల ప్రదర్శనం జరిగినది భారత నారీమణులు వెంటనే తమ చీరచెరగులు- ఆకు పసుపు, తెలుపు, వంగపండు చాయవి - చించి - జాతీయపతాకంగా కట్టి ప్రదర్శించేశారు.

వర్సైల్స్ సంధిపత్రము దస్కతవుతున్నపుడు-ఒక సంగీతనాటకమునకు (Opera) వెళ్ళాను. ఎక్కడ చూచినా ఆనందం తాండవిస్తున్నది; వేదికమీద వివిధదేశాల పతాకాలు ఎగురుచున్నాయి. కిన్నరకంఠతో పేరుపొందిన నటియొకతె ఆరాత్రినటిస్తున్నది. మధ్యలో పరాసువారు పరాసుదేశపు పతాకమును గౌరవ పురస్సరంగా ఆమెకు చుట్టబెట్టారు. నా ప్రక్కన కూచున్న భారతీయుడు నిట్టూర్పువిడిచి, "మనకొకజండా ఎప్పుడేర్పడుతుంది" అని నాతో అన్నాడు.

ఇటీవల ఢిల్లీలోజరిగిన ఆసియా దేశాలసభలో వేదిక వెనుక అన్నిదేశాల ఝండాలు అమర్చబడ్డాయి; కాని భారతజాతీయ పతాకంమాత్రంలేదు. ఆ మహాసభ ఏ రాజకీయకక్షకు చెందనిది. ఆ లక్షణం దానికి నిలపడానికనే, - త్రివర్గపతాకాన్ని బుద్ధిపూర్వకంగా ప్రదర్శించలేదు. ఆసియాదేశాల మహాసభా రంగంనుండీ త్రివర్ణ పతాకం తొలిగించవలసి వచ్చినందులకు మాకు కలిగిన తలవంపులు, ఆవేదన ఊహింప సాధ్యమా?

ఈ రోజున మన గౌరవం నిలువబెట్టు కుంటున్నాము. ఈ పతాకంక్రింద వేలకొలది స్త్రీలు, పురుషులు, అన్ని కులాలవారు, మతాలవారు - పోరాడారు; బాధలుపడ్డారు. ఆ పతాకాన్ని సమర్థించి నిలువబెట్టుకొని కీర్తిస్తున్నాము.

ఈ ఝండాక్రింద రాజు, రైతు అనే భేదంలేదు; స్త్రీ పురుష తారతమ్యం లేనేలేదు.

నూతనముగా ఆవిర్భవించిన స్వతంత్రభారతదేశపు సంతానమగు స్త్రీ పురుషులు - మీరంతా, హిందువులు, ముసల్మానులు, క్రిష్టియనులు, జైనులు, సిఖ్ఖులు, పారసీకులు - మీరంతా, అవిభాజ్యమగు ఏకస్వరూపము; అద్వైతమగు ఒకే దివ్యశక్తి."

కట్ట కడపట ఆ ముదుసలి తెలుగు ముత్తైదువ - ఉత్సాహాతిరేకమున, చేయెత్తి గంభీరమగు కిన్నెరవాణితో - "మీరంతా లేచి ఆ పతాకాని కభివందన మొనర్పండి - అని అజ్ఞాపిస్తున్నాను" అన్నది.

1905 లో బెర్లిన్ నగరంలో జర్మన్ సోషలిస్టులంతా సమావేశమైనారు. ఆ సమావేశానికి అప్పుడు జర్మనీలో ఉన్న మదాంకామాగారి నాహ్వానించారు. సభలో ఆమెనుకూడా భారతీయ సమస్యలగూర్చి మాట్లాడమన్నారు. ఆమె కొన్ని ఉజ్వలమైనవాక్యాలు పల్కినమీదట "అభినవ భారత్" కొరకై ఏర్పాటైన త్రివర్ణ పతాకము నొకటి ఛరాలునతీసి చేతబట్టి ఉత్సాహాతిరేకమున దాని నాడించుచు, - ఇట్లు మృదుమధుర గాంభీర్యస్వనమున జెప్పినది:—

"ఇది భారత స్వాతంత్ర్య పతాకము. గమనించండి; అది అవతరించినది! ఆత్మార్పణము గావించిన భారత యువకుల రక్తము చేనిది ఇప్పటికే పవిత్రమై యున్నది. ఓ పురుష వరేణ్యులారా! ఈ భారత పతాకమునకు, భారత జాతీయ పతాకమునకు, లేచి నమస్కరించండి."

ఇదియే ఒక్క భారతీయవ్యక్తి - స్త్రీ - భారతజాతీయ స్వతంత్ర పతాకము అనియొకదానిని - బహిరంగముగా ప్రదర్శించుటకు మొట్టమొదటిసారి.

> తొలిసారిగా కేంద్ర శాసన సభమీద ఆగస్టు 15 న ఎత్తబడే నూతన జాతీయ పతాకాన్ని అనేకవిధాల దేశసేవ సంఘసేవ చేసిన 50 మంది భారత నారీమణులు రాజ్యాంగ చట్టసభకు 14వ తేదీన సమర్పిస్తారు. శ్రీమతి సరోజినీదేవిగారు వారికధ్యక్షురాలు.

మదాంకామా సంపన్నురాలైన భారతదేశ వాసియగు పారసీకస్త్రీ. ఆమె దాదాభాయి నౌరోజీగారు పార్లమెంటుకు అభ్యర్థిగానిల్చినప్పుడు కష్టించి ఆయన విజయమునకు చాల పాటుపడినది. పిదప మితవాదరాజకీయములు ఆమెకు నచ్చలేదు. అప్పుడామె హోమ్ రూలు లీగులోచేరి పనిచేసినది. ఆలీగు - బిసెంటు, తిలక్ గార్లేర్పరచినదికాదు. ఇరువదవ శతాబ్దారంభంలో శ్యాంజీ కృష్ణవర్మగారు - శాంతియుతమైన విప్లవమును ప్రోత్సహించు నీసంస్థనేర్పరచినారు. దానితరపున ఆమె అమెరికాలో చాలాప్రచారము చేసినది. ఆపిదప కర్జన్ ప్రభువు హయాములో రేగిన క్రూర పరిపాలనా విధానమువల్ల ఆమె ఉద్రేకురాలై వీరసావర్కర్ అప్పుడే ఇంగ్లాండుకువచ్చి ప్రారంభించిన 'అభినవభారత్' అనే విప్లవసంఘమునజేరి వారికి ప్రోత్సాహమిస్తూ ఉండేది. ఆమె పైసభకు భారతీయస్త్రీ లందరివలెనే చీరధరించి వెళ్లేసరికి ఆమె ఎవ్వరో రాజకుమారి అనుకున్నారట. లేచిమాట్లాడుసరికి నిజతత్వమెరింగి ఆశ్చర్యపోయినారు, కావున మొట్టమొదట భారత జాతీయపతాకము నెగురవేసినకీర్తి భారతనారీమణిది, అందును పార్సీస్త్రీది.





# బాల స్వాతంత్ర్య గేయం





ఆగష్టు పదిహేనొచ్చింది!
ఇండియా స్వతంత్రం తెచ్చింది!

ఆంగ్లేయ ప్రభుత్వం అణిగింది!
స్వాతంత్ర్య సమరం మణిగింది!

దేశీయ విభజన జరిగింది!
జాతీయ జెండా ఎగిరింది!



హిందువు లందరకు హిందూస్థాన్.
ముస్లిమ్‌వీరులకు పాకిస్థాన్.

భాగింప బడ్డది మనదేశం.
పాలింప బడును మనరాజ్యం.

మానవులలో మాలలు.
దేముడి మెడలో మాలలు.



మతకలహాలు మానేయి!
జాతి విభేదాలు పోయాయి!

స్వాతంత్ర్యం కోసం స్వశక్తి యిచ్చే
గాంధి తాతకు జే! జే! లు.

స్వరాజ్యం కోసం స్వార్థం వీడే
నెహ్రూ బాబుకు శ్రీ! శ్రీ! లు.

నిడదవోలు పార్వతీశ్వరరావు.








పరపీడనాయత్తమై అంధకారబంధురమైన ప్రపంచంలో వెలుగునకై భారతమాతచేబట్టిన

పరంజ్యోతి

# గృహలక్ష్మికి ఆశీస్సులు

—ఆచార్య కృప్లానీ–కాంగ్రెసు అధ్యక్షులు.—

ఆగస్టు 15 వ తేదినాడు మనం స్వతంత్ర దేశమునందలి పౌరులుగా నిద్రలేస్తాము. ఈస్వాతంత్ర్యం ఆరోజు తెల్లవారేసరికి ఉట్టిపడడం లేదు. లెక్కలేనంతమంది స్వార్థత్యాగ మొనర్చి దీనిని నిర్మించిరి. వారు స్వాతంత్ర్యము కొరకు పోరాడిరి; ప్రాణములను గోల్పోయిరి. కావున మనకు తెలిసినవారికి, తెలియనివారికి, ఈవీరులందరికి బాంధవ్యంతోడి కృతజ్ఞతతో, గౌరవముతో, మున్ముందుగా సమస్కరింతము. వారు మనకు సంక్రమింప జేసిన ఈపెన్నిధానమును నిర్నిద్ర మానసులమై సంరక్షించుకుంటామని ప్రతిజ్ఞ గావింతాము.

ఈస్వాతంత్ర్యము ఏ ఒక్క వర్గమునకో, తెగకో, కక్షికో కాదు; ప్రజాసామాన్యమంతటికి, యావద్భారత దేశానికి. అదిమనకందరికి తగియున్నది. కాబట్టి ప్రతిస్త్రీ, పురుషుడు, శిశువును స్వతంత్రము, సగర్వము నైన దేశమందలి బాధ్యతగల పౌరులుగా ఈనాటినుండి నడుచుకో వచ్చును. ప్రతివాడూ, తన కాయుష్యం, తన కైశ్వర్యం, అని యోచింపరాదు; తన ఇరుగు పొరుగును గూర్చి కూడా యోచింప వలెను. మన వ్యక్తిగత వర్గగత ప్రత్యేక ప్రయోజనాలు, సమిష్ఠి ప్రయోజనాలకు తావిచ్చునట్లు చేయుచు, అందరము కలిసి కట్టుగా బ్రతుకు సాగించుటకు నేర్చుకుందాము.

ఈవిధముగానే మన మాశించిన భారత దేశమును నిర్మించ గలము. పూర్వకాలమున వలెనే తిరిగీ ఆమెను, ప్రపంచమున కీర్తివంతము, గౌరవనీయము నైన దానినిగా నొనర్ప గలము.

---

కళా ప్రపూర్ణశ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు. డి. లిట్.

జయపురం మహారాజావారు.

డాక్టరు కోట నరకేసరి పుత్రికయగు "గృహలక్ష్మి" వింశతివత్సరయువతియై నారుల దుస్థితిని బాపఁ దెలుఁగునాట సంచరించుచు స్త్రీధర్మమును, పాకవిధానమును, గృహవైద్యమును, కర్తవ్యకృత్యములను నేర్పిప్రత్యేక గృహిణిని గృహలక్ష్మిని జేయఁ బూనెడిని. తత్పత్రిక చిరజీవిని యగుఁగాక! తద్వాంఛ నెఱవేఱుఁగాక! -

—గౌ. శ్రీవింజమూరి గోవిందరాజాచారిగారు. బి. ఎ. బి.ఎల్.,

హైకోర్టుజడ్జి, మదరాసు.—

ఈ ఉత్కృష్ట సమయంలో "గృహలక్ష్మి" కి నా అభినందనాలు.

ఆంధ్రనారీలోకానికి "గృహలక్ష్మి" చేసిన సేవ జగద్విదితం. ఇతోధికంగా ఇక ముందు చెయ్యాలి. చేస్తుందనడానికి నాకే సందేహము లేదు.

రాజకీయ స్వాతంత్ర్యం ఈనాటికి మనకు లభించింది. ఈస్వాతంత్ర్యం హిందూ దేశముయొక్క సర్వతో ముఖాభివృద్ధికి ఉపయోగించుకోవాలంటే స్త్రీలసహాకారం ముఖ్యంగా కావాలి.

ప్రాచీన హిందూ నారీమణుల జీవితాలలో నిబిడీకృతమైన ఆదర్శాలను నిల బెట్టుకుంటూ మనకుటుంబ జీవనం నీతి, అందము, సౌఖ్యము, విజ్ఞానము, ఆనందము వీటికి ఆటపట్టు అయేటట్టు చూస్తూ ఆర్థికంగానూ, ఇతర విధాలా స్త్రీలకు పురుషులతో సమాన ప్రతిపత్తి స్వాతంత్ర్యాలు కలుగ జేయడం, ఎలాగో ఇదివరకు కంటే కూడా ఇప్పుడు తీవ్రంగా ఆలోచించ వలసి యుంటుంది. మహోత్తరమైన ఈసమస్యా పరిష్కారానికి "గృహలక్ష్మి" మార్గదర్శి కావాలని ఆశిస్తున్నాను.

---

—ప్రొ. డి. కె. కార్వేగారు, భారతమహిళా విశ్వవిద్యాలయ స్థాపకులు, పూనా.—

"స్వాతంత్ర్యసంచిక" ప్రకటించుచున్నాము - అని తెలియజేస్తూ తాము వ్రాయించిన ఉత్తరమునకు చాలా వందనములు. సుమారిరవై సంవత్సరాలుగా ఈమాసపత్రికను నడుపుచున్న వారిని మున్ముందుగా అభినందిస్తున్నాను. ఈవిలక్షణమైన సన్నివేశమున తాము ప్రత్యేకసంచికను వెలువరింప నూహించుట చాలా మంచి ఉద్దేశము. స్త్రీల అభ్యుదయమున్నకై ఈసంచిక పాఠకురాండ్రకు మంచిప్రోత్సాహ మొసంగునని ఆశిస్తున్నాను. పెత్తనం వచ్చిన స్త్రీలు, ఇంటిపనుల బాధ్యతలును, ఇకపై తమ కోడండ్రకప్పజెప్పి అజ్ఞానంలో నున్న అమాయకపు స్త్రీలకు విద్యాబోధనము చేయ వచ్చును.

మీ "గృహలక్ష్మి" చిరంజీవియై ఉపయుక్తమగు జీవితం గడుపుగాక.

—సర్. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు. ఎం. ఏ. డిలిట్.—

ఆక్సఫర్డు విశ్వవిద్యాలయాచార్యులు, కాశీ హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షులు.

"గృహలక్ష్మి" ని స్వాతంత్ర్య సంచికగా ప్రకటించు చున్నందులకు సంతోషము. దేశమొకప్రక్క విభాజ్యమై, చిరకాల వాంఛితమగు సంపూర్ణ స్వాతంత్ర్యముగాక డొమినియన్ స్టేటసే సంప్రాప్తమైనా శతాబ్దములుగా బానిసత్వము ననుభవించిన భారతీయులు నేడుఆనందముతో ఉత్సవములు చేసుకొనకుండ నుండజాలరు. అయితే పైరెండు లోపములు తీరువరకు భారతీయులు స్త్రీ పురుషులు దీక్షగా కృషిచేయ వలెననే నిశ్చయమును, ఈ ఉత్సవము మధ్య మరువరాదు. ఇందుకు ముఖ్యముగా ఆంధ్ర స్త్రీలను "గృహలక్ష్మి" నిరంతరము హెచ్చరించుచుండుననుటకు ఈస్వాతంత్ర్య సంచిక ప్రకటనమే తార్కాణము.

మరియు డా. కే. యన్. కేసరిగారి సంపాదకత్వమున వెలువడుచున్న నీ మాస పత్రిక విజ్ఞాన ప్రబోధక మనుటకు వారు అన్యధా కూడా లక్షలాది విరాళము లిచ్చి పోషించి నిర్వహించుచున్న విద్యాలయాలే సాక్షి. "గృహలక్ష్మి" చిరకాలము వర్ధిల్లుగాక.

---

ప్రొ. వంగల శివరాంగారు, లక్నో విశ్వవిద్యాలయం.

స్వతంత్ర భారత ప్రభుత్వపు నూతన ప్రధాని చెల్లెలగు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారిని, మంత్రిణిగా ఏర్పరచు కోవడమున్నూ, న్యూయార్క్ పట్నంలో జరిగిన యునైటెడ్ నేషన్స్ సమావేశానికి వెళ్లిన భారత రాయబారవర్గం నాయకురాలినిగా పంప గల్గడమున్నూ, ఆగ్రా అయోధ్యా ప్రాంతాలు గూడిన యు. పి. రాష్ట్రము యొక్క గర్వింప దగిన అదృష్టము. భారత దేశపు రాయబారిగా రష్యాకు స్త్రీనే పంప గల్గిన అదృష్టంకూడా ఆ యు. పి. రాష్ట్రముదే. ప్రపంచంలో ఇట్లా విదేశాలలో స్త్రీ రాయబారిగా ఉండడానికిదే మొదలు. భారతదేశమంతటా, ప్రపంచమంతటా, మొట్ట మొదటగా, స్త్రీని గవర్నరుగా బడసే భాగ్యమున్నూ యు. పి యే చూరగొన్నది. ఆపదవిని అధిష్టించి నామె ప్రపంచమంతటికీ కోకిలవాణి అనిపేర్గాంచిన శ్రీమతి సరోజినీదేవి. ఆదేవి భర్తగారు హైదరాబాదునందు గొప్పడాక్టరగు ఆంధ్రుడుగావున, ఇందుకు ఆంధ్రులును ప్రత్యేకంగా గర్వించవచ్చు. రాగల కాలమున ఇట్టి అవకాశము లితరులకునుగలవు.

ఆంధ్రరాష్ట్రము త్వరలో ఏర్పడగా ఆంధ్రులు తమ తెల్వి చూప పలయును. స్త్రీలకందుకువలయు స్వార్థత్యాగము, సేవాసక్తి కల్పించువో"గృహలక్ష్మి" కృతకృత్యయే.

—శ్రీయుత కళా వేంకటరావుగారు, మద్రాసు రివిన్యూమంత్రి.—

"గృహలక్ష్మి" స్వాతంత్ర్య జన్మదినోత్సవ సంచిక ప్రచురించు చున్నందులకు సంతోషము. నేటివరకు భారతదేశము పరులపాలనలో కృంగియున్నను, నేడు తన గృహమునకు అధికార భారము వహింపనున్నది. ఇదివరకు ఇతరులతో పోరాటము. ఇకపైన స్వగృహ నిర్వహణ. అందువలన బాధ్యత హెచ్చినది. అచిరకాలములో ప్రాప్తింపనున్న ఆంధ్రరాష్ట్రములో నున్న గృహలక్ష్ము లెల్లరకు, "గృహలక్ష్మి" మిన్నయై, స్వధర్మ స్వరాజ్య నిర్వహణకు తగుసలహాల నొసంగుచు వర్ధిల్ల గలదని యాశించు చున్నాను.

—శ్రీయుత. బి. జి. ఖేర్ గారు, బొంబాయి ప్రధానమంత్రి.—

"గృహలక్ష్మి" స్వాతంత్ర్య సంచిక తన పాఠకులందరికి, సంతోష స్వాతంత్ర్యముల చిహ్నమై వెలయుగాక. భారతీయస్త్రీ తాను నివసిస్తున్న ప్రపంచ రహస్యాని ఎంతత్వరగా అర్థంచేసుకొని ఆమోదించ గలుగుతుందో, అంతత్వరగా ఆమె స్వాతంత్ర్యమును పొంది అభివృద్ధి చెందగలదు. అందుకుగాను ఆమె విద్యావంతురాలై దైహిక, మానసిక శక్తుల నెల్లసాధించి సంపూర్ణ వికాసము నందవలయును. భారతదేశపు పూర్వచరిత్ర, అంతకన్నా ముఖ్యముగ, ఆధునిక చరిత్ర, ఉత్తేజకరమైనది. శ్రీమతి విజయలక్ష్మిపండిట్, సరోజినీ నాయుడు, రాజకుమారి అమృత కేర్ గార్లు అవలంబించిన ఆదర్శములే అవలంబనీయములైతే మన స్త్రీలకు తేజోవంతమగు భవిష్యత్తుకలదు. అందుచే, ఈస్వాతంత్ర్యోత్సవ శుభదినమున వారు ముందుకువచ్చి అభ్యుదయ పతాకమును ధరింతుమని ప్రతిజ్ఞగైకొందురుగాక.

—శ్రీయుత బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బి. ఎ. బి. ఎల్., సి. బి. ఇ.—

—మాజీ మద్రాసుకౌన్సిల్ అధ్యక్షులు.—

'గృహలక్ష్మి' స్వాతంత్ర్య సంపుటమును ప్రచురింప మీరు దల పెట్టుట హృదయ రంజకము. భారతీయ స్వాతంత్ర్య సమరమునకు చేదోడయి నిలచిన ఆంధ్రనారీ లోకమునకు 'గృహలక్ష్మి' జ్ఞానోత్తేజకముగ యిరువదియేడులు సేవయొనర్చెను. ఆకృషి ఫలముగా నేర్పడు ఆసంచిక లావణ్య ప్రదీప్తమై, విజ్ఞానోద్దీపనమై చిరకాలము ప్రతి యింటను రత్నదీపమువలె నలరారుగాక. 'గృహలక్ష్మి' ని యిన్నాళ్లు కుశలతతో సమర్థించిన యజమానులకు నాపరిపూర్ణ హృదయాభివాదములు.

—శ్రీమతి చోడగం అమ్మన్నరాజాగారు, మద్రాసు అసెంబ్లీ డిప్యూటీ స్పీకర్—

మనకష్టములు కడతేరాయి. గాఢమైన చీకటి రాత్రిగడిచిపోయింది. స్వరాజ్యము లభించింది. "వందేమాతరం, మనదేరాజ్యం" అనుటకు భయపడవలసిన రోజులు పోయి రాజ్యం మనదైంది. ఆనందించ వలసిన సమయమిది.

శ్రీమతి కొండ పార్వతీదేవిగారు, బి. ఏ.

ప్రధాన కార్యదర్శిని, స్థాయిసంఘ సభ్యురాలు, అ. భా. మ. స, గుంటూరు.

మన భారతవర్షము, లోకమునకంతయు ఆదర్శనీయమై, మహోత్కృష్టసాధనమైన అహింసా మార్గమున, దాస్యశృంఖలములనుండి విముక్తిపొంది, స్వాతంత్ర్యమును బడసినది. మనకందరకిది మహదానంద కరమగు సమయము. ఈ సమయమున "గృహలక్ష్మి"ని స్వాతంత్ర్య సంచికగా ప్రకటించి ఆంధ్రనారీమణుల వైజ్ఞానికాభివృద్ధికి తోడ్పడుచున్నందులకు అభివందనము లందజేయు చున్నాను.

"గృహలక్ష్మి" ఇరువది సంవత్సరములనుండి ఆంధ్రమహిళల విజ్ఞానాభివృద్ధికై అపారమగు కృషి చేయుచున్నది. మున్ముందును, దేశమునకు, విదేశములకు సంబంధించి నట్టియు, అంతర్జాతీయకములు నగుననేకవిషయులు, ఆంధ్రనారీమణులకు సుబోధకములగు నట్లొనర్చి, ఆంధ్ర నారీలోకమున, విజ్ఞానవంతముగను, ఆదర్శగృహిణీ సమేతముగను నొనర్చుటకు తోడ్పడి, మార్గదర్శినియై, జ్ఞానప్రదాయినియై, ఆంధ్రనారీ గగనమందు దివ్య జ్యోతియై వెలుగగలదని ఆశించుచున్నాను.

—శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు.—

కవయిత్రి - విశాఖపట్నం.

ఇరువది సంవత్సరముల క్రిందటి వరకు ఆంధ్ర గృహలక్ష్మి లోకము ప్రతిభగల దయ్యు అసూర్యం పశ్యగా అజ్ఞాత మనుభవించినదనిన అతిశయోక్తి కానేరదు. తమ "గృహలక్ష్మి" కరావలంబనమున ఆనారీలోకము ఇనుమడించిన అభ్యుదయ లేఖినీ స్వాతంత్ర్యములతో సకలవిధముల జ్ఞానవంతమైనది. అటులనే తమ స్వాతంత్ర్య సంచిక మొదలు ఇంకను విజ్ఞాన విశృంఖల స్వాతంత్ర్యముల నారీలోక మలరారు నట్లు చేయుగలదు.



శ్రీమతి చుండూరు రత్నమ్మగారు

మాజీ మ్యునిసిపల్ అధ్యక్షురాలు, ఏలూరు,



శ్రీమతి యర్రా. లక్ష్మీదేవమ్మ గారు, మాజీ ఎం. ఎల్. ఏ.



శ్రీతిమ వల్లభనేని సీతా మహాలక్ష్మమ్మగారు, ఎం. ఎల్. ఏ.

# ప్రథమ భారతజాతీయ స్వాతంత్ర్యపతాకం



1905 లో బెర్లిన్‌లో మదాం కామా ప్రదర్శించినది.

405 పుట చూడండి.

★

నూతన



★

భారత, జాతీయ,

స్వాతంత్ర్య పతాకం.

తాము 15-8-47 వ తేదీనాటికి "గృహలక్ష్మి" స్వాతంత్ర్య పత్రికగా వెలువరింప దలంచితిమని వ్రాసిన లేఖచూచి, ముదిత హృదయనై, నాయానంతసమును యీ లేఖామూలమున వెలువరించితిని. మీరు స్త్రీ జనాభ్యుదయమునకై చేయుకృషి యెంతయు ప్రశంసార్హమైనది. నేటి, యీమాత్రపు స్వాతంత్ర్యమునకేని కారణము మీయట్టివారి సంపాదకత్వము కల్గిన "గృహలక్ష్మి" సేవాఫలితమేనని చెప్పుటకు నేనెంత మాత్రము వెనుదీయను. కావుచిత్కముగా, గాక పురుషలోకమంతటను మీకుగలయట్టిసుహృద్భావమేర్పడ జేయుగాత యని "భగవతి"ని ప్రార్థించుచున్నాను.

దువ్వూరి సుబ్బమ్మ
రాజమండ్రి.




'గృహలక్ష్మి' మన పూర్వపు పరిచయురాలె. తన బాల్యమునందే గృహలక్ష్మి హిందూనారీలోకమునకు గావించిన సేవ ఎల్లర కిదివరకే తెలియును. ఇప్పుడు 'గృహలక్ష్మి' నిండుయౌవనముననున్నది. భారత స్వాతంత్ర్యముతో పాటు భారత నారీమణుల స్వాతంత్ర్యమును చేకూరినదనుటలో సందేహములేదు. గృహలక్ష్మియు తనశక్తికొలది ఇక ముందుసహా స్త్రీ బృందమునకు అపారమైన సేవచేసి వన్నెకెక్కుగాక.

ఎన్. లక్ష్మీదేవమ్మ
బళ్లారి,



"గృహలక్ష్మి" స్త్రీలకు గావించిన సేవను గూర్చి ఆంధ్రదేశములో ప్రశంసించని స్త్రీయుండదని నావిశ్వాసము. స్వాతంత్ర్య భానుడుదయించు పర్వదినమున "గృహలక్ష్మి", స్వాతంత్ర్య సంచికను ప్రకటించి, తన రెండు దశాబ్దములనుండి యొనరించిన అమూల్య సేవకు 'గుర్తు' గా యీకానుకను స్వతంత్రభారతమునకు సమర్పించి తన ధర్మమును నిర్వహించుచున్నందులకు సంతసము.

వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ
ఎం. ఎల్. ఏ,

# పాటూరి దంపతుల ఆశీర్వచనము.

పత్రికలలోన మేటివై పాటు పడుచు
భరత భామల విజ్ఞాన భాండమగుచు
ఇంటఇంటను పూజింప యింపుమీఱ
వెలుగుచుండుము 'గృహలక్ష్మి' వేడ్కగాను.

దేశదేశాల నీ కీర్తి తేజరిల్ల
నిర్భయంబుగ విహరింపు నేర్పుతోడ;
రత్నగర్భను బుట్టితి రమ్యమలర
విమలకీర్తిని నిరతంబు వెలయుమమ్మ.

దేవదేవుండు నీకిచ్చు దివ్యయశము;
శుభముకల్గును నీకెప్డు శుద్ధచరిత;
స్వైరవీథుల విహరింపు స్వేచ్ఛగాను;
పుణ్యచారిత్ర వెలుగొందు భువినినీవు.

— బాల సరస్వతమ్మ.

నెల్లూరు,



భరతవర్షంబు దివ్యప్రభావమలర స్వేచ్ఛ ఖండాంతరాల నెవ్వేళ నలర
భరతయువతుల కీర్తిప్రభావమెపుడు చాటుచుండుము 'గృహలక్ష్మి'! తేటపడగ.

—సుబ్బరామయ్య.



"గృహలక్ష్మి" జననమందిన దాదిగ ఆంధ్రనారీలోకమునకు, గృహిణులకు సర్వతోన్ముఖమైన జ్ఞానమును, చక్కని మధురమైన సులభమైన, భాషలో అందజేయుచున్నది. స్త్రీలవిధులు, కర్తవ్యము, హైందవ సాంప్రదాయమందు స్త్రీకిగల ఔన్నత్యమును గురించియు పునరుద్ఘాటించుచు, స్త్రీలోకమునకు వన్నెదెచ్చుచున్నది. ఇంటింట నుండదగిన మీ "గృహలక్ష్మి" చిరంజీవియై భారత స్వాతంత్ర్య యుగమున నారీలోకమునకు నూతన విజ్ఞానము వెదజల్లుగాక.

ములుప్పూరి చుక్కమ్మ

ఏలూరు,

# రామరాజ్యము

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు, రాజమండ్రి.



ఇంచుమించు ఏడెనిమిదివందల సంవత్సరముల క్రితము మనదేశము విపరీత పరిస్థితులలో చిక్కుకొని, పరాధీనమై, క్రమముగా మహమ్మదీయుల పరిపాలనలో బడిపోయినది. తద్వారా రెండువందల సంవత్సరముల క్రితమునాటికి పింగాణిచిప్పలు, గాజు సామగ్రులు మొదలగునవి అమ్ముకొనురీతి వర్తకులుగా వచ్చిన, ఇంగ్లీషు కంపెనీ వారి స్వాధీనముకాగా నేటికిని ఆసేతు హిమాద్రి పర్యంతమును తమ పశుబలముచే, మనరత్నగర్భను అన్నివిధములా వారే యనుభవించుచుండిరి. మన కడుపుకొట్టి, నోరుకట్టి కరచరణాద్యవయవంబుల బంధించి, వ్యక్తిత్వము పోగొట్టి, భయభక్తులు పురిగొల్పి, విరోధభావంబులు నెలకొల్పి, మతద్వేషానలంబున మ్రగ్గజేసి, బానిసోద్యోగంబులనెడి ఎరచే, మనదేశీయులచేతనే మనకన్నుబొడిచి తెరచాటు సూత్రధారిలాగ భారతావనిరంగమున, ఇచ్ఛారాజ్యము, భరతుని పట్టమువలె, తాముభోగులై, మనలను జోగులుగాను, రోగులగానుచేసి, అకాలమరణంబులు, ఆకలిమంటలు, కంట్రోలు భత్యములతో, తెలిసి తెలియని అజ్ఞానాంధకార, హూణవిద్యా వ్యామోహితులుగా నొనర్చి బానిస పార్టును మనకిచ్చుచు అస్వాతంత్ర్యపు జీవితనాటక మాడించి రన్న సంగతెల్లరకును విశదమే. అదినేటి కస్తమింప నున్నది.

నఱికి ముక్కలుచేసి పాకిస్థాన్ నిలబెట్టుకొని తీరుతానన్న జిన్నాసాహేబ్ పట్టుదల నిర్వహించుకొని తీరాడు. హిందూస్థానం అంతా ఒకటేగాని రెండు కాకూడదు అని కాంగ్రెసు ఆరంభ శూరత్వములో నుండి తుదకు మెత్తబడి విభజనకు లోబడింది. దీని ఆసరా చూచుకొని స్వదేశ సంస్థానాలు ఇంకా విభజించాలంటున్నారు.

మెల్లిగా వెడతామన్న బ్రిటిష్‌వారు గోడమీద పిల్లివాటము. ఇద్దరికి విరోధము కల్పించుటలోను, మధ్య నొకపార్టీలోనుండి తిన్న యింటివాసాలు లెక్కపెట్టుటలోను తెల్ల వాళ్లంత గట్టివాళ్లులేరు.

ముస్లిం ముసుగులో దూరి కలతలు పుట్టించి తిరిగి వెనుకటి రీతిగా, హిందూ ముస్లింరాజ్యముల విరోధ అవకాశములలో మధ్యవర్తిగా వుండి వంచించి, రెండుతెగల

వారి రాజ్యమున్ను, రెండు పిల్లుల రొట్టె తగవు కోతి తీర్చినట్లే పండుకోతి మరల భక్షించ తలచిన నాటక మిదియని నమ్ముడు గాన ఇకనైన మేలుకొనుడో నాయకులారా! ఉడుకు నెత్తురును చల్లార్ప వద్దు. దేశమాతను తిరిగి పరహస్తంచేయవద్దు. బానిసల మవవద్దు వినతాసుతుని (గరుత్మంతుని) ఆదర్శమే అవలంబనీయము. కాలుజారితే కాల్వలోబడి 'నదినాం సాగరోగతియే' యగును. మేల్కొనండి నడుములు కట్టండి, పార్టీలు మానండి. ఐకమత్యముగా మెలగి పనిచేయండి. ఇదే భగవంతుని ప్రబోధ వచనము. భారతాంబ ఆదేశము. తల్లిఋణము తీర్చుకొనండి. ధర్మరాజ్యము, రామరాజ్యము స్థాపించండి.

# శ్రీమతి పాటూరు బాల సరస్వతమ్మగారు.

నెల్లూరువారు. బాల్యమునందు 1917 లో విజ్ఞానచంద్రికా పరిషత్తునందు స్వర్ణపతకములను బడసిన వారు. 1920 సం॥ లో గాంధీగారి పిలుపువిని అసహాయోద్యమమునందు ప్రవేశించిరి. 1920-24 మధ్య మూడులేక నాలుగుమార్లు 144 సె॥ ఉల్లంఘించి శిక్షింపబడిరి. ఖద్దరు విక్రయమునందును. రాట్నపు ప్రచారమునందును, కల్లు అంగళ్ళు, సీమ గుడ్డల దుకాణములందును పికెటింగ్ గావించిరి. తర్వాత ఉప్పుసత్యాగ్రహమునంద గ్రస్థానము వహించిరి. "శారద" యను సారస్వత మాసపత్రికకు సంపాదకురాలుగా నుండిరి. వ్యక్తి సత్యాగ్రహమునందు పాల్గొని అరెస్టు చేయబడిరి. వీరును, వీరిభర్త పాటూరు సుబ్బరామయ్యగారును నేటివరకు అనేక కష్టములకు గురియయ్యు కాంగ్రెసు సేవయందు నిమగ్నులై యున్నారు. ప్రస్తుతము కస్తూరిదేవి బాలికాహైస్కూలనా బరుగు కస్తూరిదేవి విద్యాలయమునందలి ప్రధమోపాధ్యాయినిగానుండి పాఠశాలకు బియ్యము వసూలుచేయుట, ముంతలు పెట్టించుటయందు నాయకత్వము వహించిరి. శ్రీ మైదవోలు చెంగయ్య పంతులుగారి భార్య భ్రమరాంబగారిపేర నెలకొల్పబడిన గ్రంథాలయమునకు కార్యదర్శినిగా నుండిరి. 1939 - 40 లో 'యువతీసమితి' యను స్త్రీ సమాజమును స్థాపించి స్త్రీ సమాజమునందు ప్రబోధము జరుపుచుండిరి. 1947లో కస్తూరిదేవి జ్ఞాపకార్థము కస్తూరిబా సమాజమును స్థాపించిరి. వీరు ఆంగ్లమందును, హిందీభాషయందును చక్కనిపరిశ్రమ చేసినవారు. వీరిభర్త సుబ్బరామయ్యగారన్నిటీ వీరంతవారే.



శ్రీమతి హన్సా మెహతా: పేరుపొందిన బొంబాయి డాక్టరు జీవరాజమెహతాగారి ధర్మపత్ని. 1897 జననం. బరోడాలో విద్యాభ్యాసం. విద్యాభ్యాసకమునకు బొంబాయిలో చాలా కృషి చేసినది. 1931 నుండి బొంబాయి విశ్వవిద్యాలయం సెనెటుసభ్యురాలు. 1937, 40 లలో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు సభ్యురాలుగా ఎన్నుకోబడినది. 1945-46 అఖిలభారత మహిళా సభాధ్యక్షురాలు. గుజరాతీలో, ఇంగ్లీషులో చాలా గ్రంథాలు వ్రాసింది. యునైటెడ్ నేషన్స్ సభయొక్క ఆర్థిక, సాంఘికోపసంఘం-మానవహక్కుల కమిషన్‌లో భారతీయ ప్రతినిధిగా భారతప్రభుత్వంచే పంపబడినది.



"హిందూసుందరి" సంపాదకురాలు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు.

ఈ పత్రిక 43 సంవత్సరములనుండి కాకినాడ విద్యార్థినీసమాజముతరపున ప్రచురింపబడుచున్నది.

ఈ విద్యార్థినీసమాజమొక మహిళావిద్యాలయమునుకూడ నడుపుచున్నది.

# ఆశీర్వచనములు

## శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారు

ఇరువది సంవత్సరాలుగా ఆంధ్ర నారీ లోకానికి "గృహలక్ష్మి" అపారమైన సేవజేసింది. భారత స్వాతంత్ర్యం స్థాపనమయిన శుభముహూర్తాన్ని కాంచగలిగింది. కాని భారత నారీమణుల స్వాతంత్ర్యం గానీ ఆంధ్ర నారీమణుల స్వాతంత్ర్యంగాని యింకా దూరంలోనే యున్నవి. స్త్రీల నందరినీ చదువరుల జేసిననేగాని, సాధ్యమయినంతవరకు వారి కర్మకౌశలముగూడ జాతిసంపత్తును పెంచేది యయిననేగాని వారికీ స్వాతంత్ర్యములేదు. భారతజాతీ స్వాతంత్ర్యమును అనుభవించనూ జాలదు. స్త్రీ పురుషులు జీవితంలో సమభాగులనడం అంగీకృతమయితేనే మన జీవితం కుంటుపడకుండా గడువగలదు. ఈ పరిణామాన్ని సాధించడానికి "గృహలక్ష్మి" నూరేండ్లు నిండువరకూ కృషి సల్పుగాత!

## శ్రీయుత వఝారేపల్లి రామచంద్రశాస్త్రి కవిగారు.

తెలుఁగు సలఁత గృహలక్ష్మి అగుటకును, ఆమె తన యింటిని భూతలస్వర్గముగాజేసి - తన చుట్టములను తానును పరమ సౌఖ్యముల నోలలాడుచు - మేలియిల్లా లనిపించుకొనునట్లు చేయుటకును, 'గృహలక్ష్మి' తనకు వీలగునంతవరకు ప్రయత్నించినదను విషయము దేశాభ్యుదయముకోరి పాటుపడు దేశ సేవకులకు అందఱకును విశదమే!

ఘోర యుద్ధకారణమున కొంతకాలము తప్పని సరిగా ఆఁగిపోవలసి వచ్చినను - ఇపుడు మరల తన విధిని తాను చేయుచుండుటయేకాక, వేలకొలఁది దేశభక్తులు పడరాని పాట్లు పడియు - కొందఱు తమ ప్రాణములుకూడ సమర్పించియు కోరినట్లుఅఖండభరతఖండమునకు సంపూర్ణముగా కాకున్నను అతుకుల బొంతగా అయినను అఱకొఱ స్వాతంత్ర్యము లభించునాఁటికి తాను స్వాతంత్ర్య సంచికగా వెలువడ నిశ్చయించుకొనిన 'గృహలక్ష్మి'కి ధన్యవాదములతో మాఁతెనుగు నుడిపత్త్రమున స్వాగతమొసంగు చున్నాను.

సంప్రదాయములు దేశకాల పాత్రముల పరిస్థితులనుబట్టి ఏర్పడును. కాన, ఒకనాటివి - ఆధ్యాత్మికములుతప్ప, తక్కినవి - పెఱనాడుల వారికి పనికిరావు. అన్ని నాడులలోను బుద్ధిమంతులు కలయుచో అవి మార్చుకొను చుందురు. ఇట్లు మన దేశమున ఎన్నో మార్పులు జరిగినవి. బ్రిటీషు దొరతనము వచ్చిన పిదపకూడ రామమోహనరాయలు సహగమనము మాన్పించి, మెప్పుపొందె.

కాన, నిష్కళంక పూర్వ సంప్రదాయములను పాటించినట్లు ప్రబోధించి, తెనుఁగునాటి స్త్రీ సంఘ, స్థితి బాగుచేయుటకు దూరదర్శకత్వముతో ఎన్నో విధముల ఎంతో ప్రయత్నము చేయవలయును. ఆ బాధ్యత వహించి, ఫలవంతముగా పనిచేసి - తెనుఁగు నెలంతల పతిభక్తి నారీలోకమునకు లక్ష్యము కావించి— మెప్పుపొందగలశక్తి పరాత్పరుడు 'గృహలక్ష్మి'కి ప్రసాదించు గాక!
గృహలక్ష్మి పత్రికామతల్లి

## శ్రీయుత దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

దాదాపు ఇరువది సంవత్సరములుగా నీ వాంధ్రనారీలోకమునకు గావించినసేవ యపారము. అటు సారస్వత విజ్ఞానము; ఇటు సంసారము దిద్దుకొనవలసినతీరు; అటు ప్రాచీనార్యమర్యాదలు, ఇటు నవనాగరికపు నాణెములుకూడా - ముద్దులొలుకు పలుకులతో, లలిత లలితములగు భావములతో మనసునకెక్క - కమ్మకమ్మగా బోధించు విన్నాణము నీకే చెల్లును.

నీ మహోన్నతాశయములు, నీదూరదృష్టి, నీ యౌదార్యము, నీ పరశ్రేయస్సహనము - లోకమున కాదర్శప్రాయములు.

పరమేశ్వరానుగ్రహమున చిరాయుష్మంతురాలవై, ఇతోధికైశ్వర్యముతో విరాజిల్లి, నిఖిలకల్యాణ గుణైకశేవలవై నిర్మలయశము నార్జింతువుగాక.

# శ్రీయుత వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు

**బి. ఏ. బి. ఎల్, వకీలు, నెల్లూరు.**

నెల్లూరులో జరిగిన పంచమాంధ్ర మహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షులు.

శ్రీ 'గృహలక్ష్మి' దేవి తన దివ్యజ్యోతిని వెలిగించి ప్రకాశింపజేయ నారంభించిననాటినుండి ప్రేమాదరములతో జూచుచుంటిని - ఈమెయు, ఈమె జ్యోతియు దినదిన ప్రవర్ధమానములై స్వయంప్రకాశకములై స్వాతంత్ర్యమును పొంది స్త్రైణమునకు దామె సర్వసంపత్ప్రదాయకములై సర్వేప్సిత ప్రదాయకములై విలసిల్లనుద్యమించు వయసునకు ఐరోపీయ ఘోరసంగ్రామము సంభవించి ప్రపంచమునంతయు కలవరపరచి వీరి యుత్సాహాభినివేశనములకును భంగపాటొనర్చినది. అంత కొంతకాల మాలక్ష్మి నిజప్రభాపటలముల నాత్మగోపనము జేసికొని తనజన్మస్థానమగు నొక సువాసితమగు పద్మములోని 'కేసరా' శ్రయముగనుండినది. యుద్ధకల్లోలము లుపశమించి లోకమిత్రుడు దీర్ఘతమస్సుననుండి వెడలి ఉత్తరాయణగతుడైన పుణ్యదినములందు కమలబాంధవుడగు నాయనతోటి ఈమెయు స్వరూపమునుధరించి తొలినాటి దీపజ్యోతిని ద్విగుణితము చేయుచు తనకాంతిని లోకమున ప్రసరింపజేయుచుండుట ఎంతయు ముదావహముగనున్నది. ప్రాయికముగ స్త్రీజనోత్సాహ ప్రరోచకవిధానములనే యవలంబించుచు కందిపచ్చడి, కరివేపాకుపొడి మొదలు శ్రీమతి పండిట్ విజయలక్ష్మి నెహ్రూగారు రష్యాకు ఇండియా ప్రాతినిధ్యదౌత్యమునందుటవరకుగల లౌకికములనెల్ల నావరించి విశదము చేయుచున్నది. శ్రీ కేసరిగారు ఆధునికాంధ్రమహాసామ్రాజ్యమున కధిష్ఠానమయిన చెన్నపట్టణమున రెండు గొప్ప ఉన్నతపాఠశాలల స్థాపించి వానికి శాశ్వతస్థితుల నమర్చి కీర్తిమంతులైయున్నారు. తమ ప్రేమంపు పట్టియగు నీ చిన్న గృహలక్ష్మికిని శాశ్వతస్థిరావాస మేర్పరచి దీనినొక చిరంజీవిని (కార్పొరేషన్) జేయదగును. ఈ గృహలక్ష్మియు స్త్రీ జనాశయములకు పరాకాష్ఠయై యే గొప్పవిషయములందు గాని రాజకీయ సమస్యలందుగాని స్త్రీజనాభ్యుదయ దాయకములగు ప్రచారములపై మన గృహలక్ష్మి యేమి అభిప్రాయమిచ్చినదని యువ్విళ్లూరుచు ఆంధ్రత్వభాగ్యములేని స్త్రీలుకూడ తెలుగు నాశ్రయించునట్లు లోకవిఖ్యాతముగా కీర్తిప్రతిష్ఠలనంది చిరంజీవినియై, స్వయంప్రకాశమై వర్ధిల్లవలయును. గృహలక్ష్మిజ్యోతియు సంజదీపములోటిది కాకుండ ప్రతియాంధ్రుని యింటను అఖండ జ్యోతియై ప్రకాశించుచుండగల ప్రభను గడింపవలయును. ఆంధ్రులకెల్లరకు అల్లారుముద్దుగ పెంపొంది ప్రతియిల్లును శ్రీలక్ష్మీనిలయమన నొప్పునట్లు స్త్రీజనమునకు సమస్తజ్ఞానవిజ్ఞానములను నందజేయ నర్హమగు సంవిధానములబొంది వర్ధిల్లవలయును. ఈగృహలక్ష్మి దీపకాంతిలో "తమసో మా జ్యోతిర్గమయి" యను వేదవాక్యమగపడు నట్లిది వర్ధిల్లి ప్రకాశించుగాక.

మాతృభూమికి పరవశ్యత తొలగిపోయి స్వస్వరూపసిద్ధి యేర్పడనుండు ఈ పవిత్రకాలముననె మన గృహలక్ష్మియు స్వాతంత్ర్యఖనిని సంచికరూపముగ వెలువరింపగలుగుటయు పరమానందదాయకమని గృహలక్ష్మిని శ్లాఘించుటయు సమంజసమై యుండగలదు.

# ❀ శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు ❀

మాజీ పార్లమెంటరీ సెక్రటరీ,



ఆగష్టు 15 తేదీని 'గృహలక్ష్మి'ని స్వాతంత్ర్య సంచికగ ప్రకటించడం సంతోషం.

1857-సం నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సమరంలో వీర విహారం చేసి శత్రువుల గుండెల్లోనిద్రించి పాతిక సంవత్సరములు నిండక మునుపే మాతృస్వాతంత్ర్యానికి బలియైన ఝాన్సీరాణీ, లక్ష్మీబాయి మొదలు 1942 సం ఆగస్టు విప్లవంలో పాల్గొని అపారమైన ధైర్య సాహసములను ప్రదర్శించిన సుచేత మొదలైన వీర నారీమణుల వరకూ భారత స్త్రీలు స్వాతంత్ర్య పోరాటాలలో చేసినసేవను, త్యాగాన్ని ఈ నాడు కృతజ్ఞతతో దేశం ప్రశంసింపక తప్పదు.

1857 సం॥ స్వాతంత్ర్య పోరాటంలో స్వయముగా ఖడ్గము పూని శత్రుసంహారం చేసిశత్రువుల ప్రశంసకు కూడ పాత్రురాలైన ఝాన్సీరాణీయున్నూ, వృత్తికి నర్తకియైనను, రణరంగంలో ప్రాణాలు తెగించి వీరవిహారం చేస్తున్న సిపాయీలకు మిఠాయి పంచిపెడుతూ తన విలాసం చేత వారిని స్వాతంత్ర్య సమరానికి ప్రోత్సాహపరచిన అజ జాన్ యున్నూ స్వాతంత్ర్యోదయ సమయమున సంస్మరణీయులు. వంగ విభజన ఫలితంగా దేశంలో బయలుదేరిన విప్లవోద్యమాల్లో తమభర్తలను పుత్రులను స్వాతంత్ర్యదేవికి బలి యొసంగిన వీర మాతలకు ఈ శుభసమయంలో నమస్కారము లర్పించుట ధర్మం. 1919 సం డయ్యరు క్రూరపరిపాలనలో అవమానముల పాల్పడి భర్తలను ఆప్తులను గోల్పోయిన స్త్రీలు నేటి స్వాతంత్ర్యమునకు కారకురాండ్రు. పంజాబు దురంతములలో స్త్రీలకు జరిగిన మానభంగమే యావద్భారత దేశంలోను ఆరని అగ్నిని రగుల్కొల్పింది. ఆక్రోశాన్ని ఆవేశాన్ని ఉద్దీపింపచేసి స్వాతంత్ర్యం కోసం సర్వసమర్పణ చేయడానికి బద్ధకంకణులను చేసింది. నేడు వాళ్లనామ రూపాలు మనకు తెలియక పోవచ్చును గాని ఈ నాటి విజయానికి వారే ముఖ్యకారకులనడానికి సందేహంలేదు. 1920 మొదలు 42 వరకు గాంధీజీ నాయకత్వాన్ని జరిగిన అసంఖ్యమైన స్వాతంత్ర్య పోరాటాల్లో భారత స్త్రీ చూపిన సాహసము, త్యాగము, ధైర్యము ప్రశంసనీయము. 1942 సం ఆగష్టు విప్లవంలో అరుణ, సుచేత మొదలైన అనేకమంది వీరాంగనలు నిరుపమానమైన ధైర్య సాహసాలను సహన శక్తిని, వ్యూహ కౌశల్యాన్ని, ప్రతిభను ప్రదర్శించి యావద్భారతదేశంయొక్క జోహారు లందుకున్నారు, బ్రిటిష్‌వారి అత్యాచారములకు లోబడి కూడా ఉరికంబముల నెక్కిన పుత్రులను సంతోషంతో స్వీకరించి ఆశీర్వదించిన వీరమాతలున్నారు. ఏఉద్యమాల్లోనూ పాల్గొనకుండానే పేరు ప్రఖ్యాతులతో నిమిత్తం లేకుండా తమ భర్తలు, పుత్రులు స్వాతంత్ర్య సంగ్రామాల్లో సర్వసమర్పణం చేస్తుంటే ఓర్మితో వాళ్లననుసరించి అజ్ఞాతంగా అనేక బాధల పాల్బడిన నారీమణులకు ఈ శుభసమయాన్ని నమస్కరించుట మనధర్మం. వారి నిష్కామసేవ లోకానికి ఆదర్శం.

నేటి స్వాతంత్ర్యము అసంపూర్ణం. పరిపాలకులు పోయినారు కాని స్వాతంత్ర్య ఫలితంగా ఏర్పడవలసిన శాంతి సౌఖ్యాలు ఇంకా కలుగ లేదు. వాటినిపొందిన నాడే మనకునిజమైన స్వాతంత్ర్యము. అట్టి స్వాతంత్ర్యసిద్ధికి భారతనారీలోకము నడుము కట్టెదరని ఆసిస్తున్నాను. 'గృహలక్ష్మి' ఈప్రయత్నంలో పూర్తిగాసహకరించు నని నమ్ముచున్నాను.

# ★ జిందాబాద్ స్వతంత్రభారత్. ★

**శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు, బి. ఏ. మైసూరు.**

సుమారు 200 సంవత్సరాల నుంచి అస్వతంత్రురాలై పరరాజ్యపాలనలో చిక్కి బానిసగావున్న భారత మాత ఆగష్టు 15 కి స్వతంత్ర్యురాలుగా కాబోవు చున్నది. ఆమె యొక్క 40 కోట్లబిడ్డలు ఒక్కసారిగా స్వతంత్రులవు చున్నారు. ఇది గొప్ప మహా సుదినము, చరిత్రాత్మక మైనరోజు. 1757 లో మొట్టమొదట బ్రిటిష్ వారిని తరిమెయ్యడానికి ప్లాసీ యుద్ధము జరిగినది, తరువాత 1857 లో సిపాయిదండ్లు లేచి భారత స్వాతంత్ర్యానికి పునాదులు వేసిరి. అనేక వీరులు ఈ స్వాతంత్ర్య సమరములో వీరస్వర్గమును పొందిరి. అట్టివీరులలో ఝాన్సీరాణి ఒకర్తె. 1947 లో ఆవీరులు ప్రారంభించి సర్వతంత్ర సమరము జయము గాంచి స్వరాజ్యస్థాపన చేయబడినది.

1885 లో కాంగ్రెసు స్థాపించబడి క్రమంగా 1920 ప్రాంతాలకి గాంధీ మహాత్ముని నాయకత్వం క్రింద ప్రజాసంస్థగామారి స్వరాజ్య సంపాదనకై అఖండ కృషిచేసి ఆమహాత్ముని ఆధ్వర్యం క్రిందనే స్వరాజ్య స్థాపన జరుగుచున్నది. ఈ పాతిక సంవత్సరాలనుంచి కాంగ్రెసు స్వరాజ్య సంపాదనకై చేసిన సేవ అమోఘము. కత్తులు, ఖడ్గాలు, సేనలు లేక శాంతి సమర పద్ధతుల వలననే విజయము పొందగలిగితిమి. ఖద్దరు, స్వదేశదీక్ష, స్వరాజ్య సంపాదనకు దివ్యాస్త్రములు. అప్పుడే ఆంధ్రదేశంలో స్త్రీలు కూడా రాజకీయ రణరంగంలో దిగి వుపన్యాస వేదికలమీద పురుషులతో పాటు స్వరాజ్య దీక్ష పుచ్చుకొన్నారు. వీరిలో ముఖ్యులు మాగంటిఅన్నపూర్ణాదేవి, దువ్వూరి సుబ్బమ్మ, యామినీ పూర్ణ తిలకమ్మ మొదలైన వారు విదేశవస్త్రదహనం ప్రజల హృదయాలలో విదేశ పరిపాలన మందసహ్యం కలుగజేయుటలోసందేహంలేదు.

1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పురుషులే కాక వేలకొలది స్త్రీలు పాల్గొని జైళ్లకు పోయి లాఠీ చార్జీలు తిని, పికెటింగు చేసి స్వరాజ్య సంపాదనకై పాటుపడిరి. ఇదే స్త్రీ వుద్యమానికి పునాది నవచైతన్యం నారీలోకంలో వికసింప మొదలు పెట్టినది. కాంగ్రెసు వుద్యమంలో పాల్గొని సేవచేసిన నారీ మణులలో కస్తూరిబాగాంధీ, శ్రీ సరోజనీదేవి, కమలాదేవి, కమలానెహ్రు, విజయలక్ష్మీపండిట్, ఆచంట రుక్మిణమ్మగారు మొదలైనవారు. మన ఆంధ్రదేశంలో శ్రీమతి వేదాంతం కమలాదేవి, శ్రీమతి దుర్గాబాయి ఈ రచయిత వున్నవ లక్ష్మీబాయమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, సుభద్రమ్మ, పోణకా కనకమ్మగార్లు. కలగర పిచ్చమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ మొదలైన వారలు కాంగ్రెసు రంగభూమిలో దుమికి సేవచేసిన వ్యక్తులు.

స్వదేశీ దీక్ష ఖద్దరుధారణ ప్రజల హృదయాలలో నాటిపోయినాయి. స్వరాజ్య సంపాదనకై ధన ప్రాణాల సంతోషముతో అనేకులు భారత మాత పాదముల మీద త్యజించారు. 1930లో ఆంధ్ర దేశంలో జరిగిన దౌర్జన్యాలు ఎప్పటికి మరుపు రావు. ఆలాఠీచార్జీలు, ఆతుపాకి పేల్పులు, రిజర్వు పోలీసుల దౌర్జన్యాలు, భయోత్పాతక దృశ్యాలు, ఖద్దరుటోపీ వేసుకున్నవారికి కాంగ్రెసు వారికి మంచినీళ్లుఇచ్చిన వారికి కూడా దండన, కాంగ్రెసు జండా సర్కారు కంటికి ఫిరంగైనది. 1930 దురంతాలు ముఖ్యంగా తూర్పు గోదావరి జిల్లాలో వర్ణించ నలవికాదు. పెద్దాపురం లాఠీ చార్జి మరొక జలియన్ వాలాబాగ్.

ఈ స్వతంత్ర సమరములో మడసిన వారనేకులు గలరు. ఈ నాడు ఆ ఆత్మలన్నిటికి శాంతి కలుగు గాక! స్వతంత్ర జండాకు జై!



శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారికి శ్రీ కేసరిగారి 'గృహలక్ష్మి' స్వర్ణకంకణ
బహూకరణము.



శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు.

# శ్రీమతి యామినీ పూర్ణ తిలకమ్మగారి దేశసేవ

శ్రీమతి యామినీ పూర్ణ తిలకమ్మగారు గాంధీ మహాత్ముని ప్రబోధంవల్ల స్వసంఘంయొక్క హైన్యతను గుర్తించి—1930 నుంచిన్ని అల్పస్వల్ప సహాయ సంపత్తులతో కళావంతుల నైతికోన్నతికై నిరంతరంపాటు పడుతూ సంఘసేవ దేశసేవ చేస్తూన్న నారీశిరోమణి. ఆమె జీవితచరిత్రను ఈవిధంగా శ్రీ కనకదుర్గాదేవిగారు వ్రాసి పంపారు. ఈమె యామినీ పూర్ణతిలకమ్మగారి కుమార్తె.

★ ★

1930 సంవత్సరము నందేయు గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణోద్యమము యొక్క నిజతత్వమును గ్రహించి, దేశసేవాభిలాషిణియై, తరుణము లభించి నందులకు మిక్కిలి సంతసించి, ధైర్య కవచమును ధరించి గొప్ప ప్రజాసేవ యొనర్చిన సంగతి ఎల్లరు ఎరిగిన విషయమే.

ఆమె మాతృభాషయందు చక్కగా ఉపన్యసించి, ప్రజా బాహుళ్యమునకు దేశసేవాభిమానమును, ఉత్సాహమును ప్రజ్వలింపజేసెను. సాంఘిక, రాజకీయ రంగములందు సమదృష్టితో వీరవనితవలె పోరాడెను. పతిత స్త్రీల ఉద్ధరణము నందును, కళావంతుల యొక్క పునరభివృద్ధి యందును ఆసక్తురాలై వారికి నూతన జీవితాదర్శముల సృష్టించుటకై, ఆమె "హిందూ యువతీ శరణాలయము" అనెడి సంస్థను మద్రాసు నందు ప్రముఖుల సహాయముచే స్థాపించెను. ఈ శరణాలయమే ఆమె చూపిన అమోఘమైన సంఘసేవాభిమానమును, మానవాభివృద్ధి యందు గల అపరిమితమైన అనురాగమును, అశక్తిని తెలియచెప్పుచున్నది.



ఆమె తన ఆత్మ ప్రబోధన వలననే ఇట్టి గొప్ప ఆదర్శప్రాయమగు నిటువంటి సేవారంగమునందు పూర్ణ హృదయముతో భగవంతుని నమ్మి సేవ యొనర్చుచున్నారు. ఆత్మశుద్ధి గలిగిన, ఆడంబరములతో నేమి పనియున్నది?

సంఘ సేవాశీలాన యెంత గలదో, నిరంతర దాస్యములో మునింగి, బాధలు పడు తమదేశీయుల మీదను అంత ప్రేమాదరణ గలదు. మొట్టమొదట "హిందూ యువతీ శరణాలయము" 1923-1928 వరకు జరుపబడెను. ఇదే కరణమందు "హిందూ యువతి" అనెడి పక్ష పత్రిక సాంఘిక దురాచార నిర్మూలన మొనర్చుటకు స్త్రీ స్వాతంత్ర్యము కొరకు జరుప బడెను. ఆంధ్ర దేశమునందు, వివిధ మండలము నందు సాంఘిక రాజకీయ ప్రబోధములను సమసుగా

గావించిరి. సైమన్ కమిషన్ రాక సందర్భమున, చెన్నపురియందు ప్రజలకు ఉత్సాహ తరంగములు ఉప్పొంగునట్లు గోక్లేహాలునందు ఉపన్యసించిరి. ఆమెకు రెండు, మూడుపర్యాయములు 144 సెక్షన్ ఇవ్వబడెను. జైలుకు తరలెడి తరుణ మాసన్నమైనప్పటికిని జనుల మధ్య నివసించి, అనివార్యమగు కష్ట పరంపరలను ఎదుర్కొని సేవ యొనర్చుచూ, ప్రక్కనే శరణాలయ ఉద్యమమును కూడా విడనాడక సాగించుచుండిరి. అనేక స్త్రీలకు సాంఘిక రాజకీయ ప్రబోధ మొనర్చినారు. ఆమె ప్రతి సభయందు మొదటి రోజులలో పావలా కాంగ్రెసు సభ్యులుగా చాలా మందిని చేర్పించినారు. శ్రీ తిలకమ్మగారు అఖిలభారత కాంగ్రెసు సభ్యురాలుగా నుండిరి. కాకినాడ యందును, మద్రాసునందును 'No changer's party' పక్షమునుండి అఖిల భారత కాంగ్రెసు సభలందు ఉపన్యసించిరి.

విదేశ వస్త్ర బహిష్కరణ సమయమందు, మద్రాసు ప్రముఖ స్త్రీలతో కలసి జైలునకు వెడలిరి. గాంధీ ఇర్విన్ ఒడంబడిక జరిగిన సందర్భమున విడుదల కాబడిరి. ఖద్దరు, హరిజన ప్రబోధములందుకూడా పాల్గొని, ఆమె విద్యాలయమునందు హరిజన బాలికల ఉద్ధరించినారు. ఖద్దరు ఉద్యమమును సైతము, రాట్నములు, మగ్గములు, సంస్థయందు నెలకొల్పి విద్యార్థులచే ఖద్దరు సేవ సైతము యొనర్ప గలిగినారు.

1928 నుండియు, "హిందూ యువతీ శరణాలయము" అనెడి నామమును "భారత కన్యా విద్యాలయము" గా మార్చి, జాతి, మత భేదములు లేక, సమస్తతెగల బాలికలకు తగిన విద్యా వసతులను ఏర్పరచినారు.

ఈ విద్యాలయము, కాలక్రమేణ తాంబ్రమందు స్వస్థలమును సేకరింప గలిగెను. కాని తగిన సొంత భవనము లేనందు వలన కుటీరములందే తాంబ్రం గ్రామ బాలికలకు విద్య గరప బడుచున్నది. ఇటీవల ఆమె "విశ్వజనని" అనెడి మాసపత్రికను స్థాపించి, కొలది సంచికల ప్రకటించి, శరీర అనారోగ్యము వలన నిలచి పోయినది.

ఈ విద్యాలయమునకు ప్రప్రథమమున కీర్తిశేషులైన దేశోద్ధారక నాగేశ్వరావు పంతులు గారు కీర్తిశేషులైన వేమవరపు రామదాసు పంతులుగారు, డాక్టరు. శ్రీ. కె. ఎన్. కేసరిగారు, శ్రీ. కె. భాష్యంగారు; శ్రీ అల్లాడి వెంకట లక్ష్మమ్మగారు, శ్రీ. కీర్తిశేషులైన డాక్టరు రంగాచారి సతీమణి కమలమ్మగారు ఇంకను తదితర ప్రముఖ్యులైన దేశభక్తులైన, విద్యాభిలాషులైన పురవాసుల తాత్కాలిక సహాయము నొసంగ బడెను.

ఇంత కాలమునుండియు మనదేశము పారతంత్ర్యములో మునిగినందున ఎన్నియో కష్టములు పడవలసి వచ్చినది. ఇప్పుడు మనదేశమునకు లభించిన స్వతంత్రము సంపూర్ణము కాకపోయినప్పటికిని భగవంతుని కటాక్షమున భావికాలమునందు భరత ఖండము అఖండమైన సర్వ స్వతంత్ర భారతావని కాగలందులకు అనవరతము సర్వేశ్వరుని ప్రార్థింప గలము.

ఈ నూతన జాతీయ పతాక స్థాపన మహోత్సవమునందు భారతీయులెల్లరు శాంతి దీక్షా పరాయణులై, పరస్పర మతకలహ విధ్వంసక నివారితులై, అన్యోన్య ప్రేమావిరాగ విరాజితులై, శాశ్వత అహింసా తత్వ సత్య సంకల్పులై, స్వాతంత్ర్యావకాశములను ఎన్నటికిని జారవిడువక అనవరతము అనంత విజయము నొందెదరు గాక యని శ్రీ తిలకమ్మగారు ఆమె హృదయ పూర్వక ఆశీస్సు అందజేయుచున్నారు.

ఈ 'గృహలక్ష్మి' ఈ స్వతంత్ర మహోత్సవ సమయమందు దేశకల్యాణార్థమై నిష్కళంక సేవయొనర్చి నిర్మల చరితాత్ములైన నారీమణులను విస్మరించుచున్నందులకు మా ధన్యవాదముల సమర్పించుచున్నారము.

ఈ పత్రికామతల్లి, ఆచంద్రార్కముగా స్వతంత్ర భారత దేశమందుగల స్త్రీలఅభివృద్ధికై ఇతోధికముగా సేవచేయ గలదని సంపూర్ణముగా విశ్వసింపుచున్నారము.

ఓం శాంతి, శాంతి, శాంతిః

# ఆ శీ స్సు

అభినవ తిక్కన సాహిత్యస్థాపక, పండిత దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు

(నెల్లూరు)

నీ 'నామకృతి, మహోత్సవ
మే నెఱుఁగుదు నింతలోన నింతటి సతివై
జ్ఞానాభివృద్ధి గాంచుట
నీ 'నాన్న' తపఃఫలంబు, నిజము, కుమారీ.

తోడఁబుట్టువులందు బంధుర యశంబు
వడసి తీనాఁటికే మేలిపలుకులకును
తరుణి వైతివి నేఁడు; స్వాతంత్ర్య మబ్బె;
నిత్యయౌవనవతి వౌచు నెగడు మమ్మ!

మహిళామండలికిన్ శుభంబయిన స
మ్యద్మార్గముం జూపు చ
న్వహమున్ దేశవిదేశవార్తలఁ దదీ
యాజ్ఞానమున్ ద్రోపుచున్
స్పృహలన్ రేఁపుచు శీలసంపద బుధా
శీర్వాద సంప్రాప్తికై
గృహలక్ష్మి! చిర మాంధ్రయౌవత చకో
రీజ్యోత్స్నవై ప్రాలుమా.

నినుఁ దనయవోలెఁ బ్రేమిం
చిన పెనిచిన మైదవోలు చెంగయ్య, యహా!
మనియున్న నెంతహర్షిం
చునొ నేఁ డదిలేమి దైవచోదనము గదా!

జై హింద్.

# మన కర్తవ్యము.





ఉభయభాషాప్రవీణ బత్తుల కామాక్షమ్మగారు,



స్వతంత్రభానుఁ డుదయించినాఁడు. దాస్యశృంఖలములు పటాపంచలము లయినవి. త్యాగమూర్తుల కృషి ఫలించినది. మహాత్ముని యడుగు జాడలలో మెలఁగిన దేశనాయకు లాదర్శభూతు లయినారు. పెక్కు వత్సరముల నుండియు జరుపుచున్న ఈ స్వాతంత్ర్య సమరములో పురుషులతోఁబాటు సమానముగఁ బాల్గొని జీవిత సర్వస్వములను దేశమాతకు ధారవోసిన నారీమతల్లుల జీవితము లతిధన్యము లయినవి. జయపతాకల నెలఁగొల్పి ఆబాలగోపాలము ఆనందమయ జీవితములను గడుపుట కిది నాందివంటి శుభ సమయము. చేసిన త్యాగములను, ఓర్చిన కష్టములను సింహావలోకనము చేసితిమేని "కృషితో నాస్తి దుర్భిక్ష" మను నుడికారము యథార్థమే యని ఋజువైనది. సత్యము, అహింస అనునవి ఆర్యధర్మములు మాత్రమే కాక జనసామాన్యమంతయు ననుసరింపఁదగిన ధర్మసూత్రములని స్థిరపడినది. ఇట్టి శుభసమయమున మన కర్తవ్యమును గూర్చి యొక్కింత ముచ్చటించుట అప్రస్తుతము కాఁజాలదు.

వర్తమానమున దేశమంతయు నన్నవస్త్రముల కాటకమునకు లోనయియున్నది. ఒకవైపున స్వతంత్ర భాస్కరుని మహోజ్వలజ్వాలలు - మఱియొకవైపున చండప్రచండముగ నలుదెసలాక్రమించుచున్న ఆకలి మంటలు, ఒకటి ముదావహము. వేఱొకటి విషాదకరము. ఈ దుర్భిక్షవ్యాప్తికి కారణము లనేకము లుండవచ్చును. కారణ కలాపమును బరిశీలించుట కిది తరుణము కాదు. సత్వర కార్యదీక్షకే మనము బద్ధకంకణులము కావలయును. ఏనాఁడు భారతీయులందఱును అన్నవస్త్రముల కారాటము నొందక సుఖమయ జీవితమును హాయిగఁ గడుపుకొనఁ జాలుదురో, ఆనాఁడే నిజముగ మనము స్వతంత్రులమని గర్వించనగును. అంతవఱకును మన యుత్సవములు నామమాత్రములే. జాతీయ జీవితమును సుఖమయముగ సాగించుటలో నాగరికతగల యే ఇతర దేశములకును మన భారతదేశము తీసికట్టుగ నుండగూడదు. ఇందులకై మనము చేయవలసిన దెంతయేనికలదు. ప్రప్రథమమున నిరక్షరాస్యతను బాఱద్రోల వలయును. ఈ మహామారి మన పురోభివృద్ధి కెంతయేని యాటంకము కలిగించుచున్నది. మన మిన్నాళ్ళుగ ననుభవించిన నికృష్ట జీవితమునకీ నిరక్షరాస్యతయే మూలకారణమని మన మెఱుంగవలయును. భావదాస్యము - భాషాదాస్యము ఈ రెండును మానవుని అధోలోకమునకుఁ గొంపోవును. ఆవ్యామోహమున కంతులేదు. ఈ సందర్భమై స్త్రీ లోకమున పెక్కుడు ప్రచార మావశ్యకమై యున్నది. తన సంతానమును విజ్ఞానవంతముగఁ జేయుట, తల్లులకుఁదప్ప మఱెవరికిని సుకరము కాజాలదు. మన భారత ప్రాచీన సంస్కృతి సుగ్గుపాలతోఁ గలిపి బిడ్డల కందిచ్చుటకు తల్లులుమాత్రమే తగియుందురు. ఇది బాల్యమునుండియు నలవఱచఁదగిన ముఖ్యవిషయము. మన ప్రాచీన సంస్కృతిని ఖండాంతరవాసు లెల్లరు శిరసావహించు చుండిరని చరిత్రలు ఘోషించుచుండఁగా

మన మద్దానికి తిలోదకము లిచ్చుట పాడిగాదు. నిజమైన భారతీయుఁ డెన్నఁటికిని భాషాదాస్యమునకు తల నొగ్గఁడు. తన జాతీయతను తన సంప్రదాయములను గుర్తెఱింగి యుండును.

ఇక భాషాప్రయుక్తరాష్ట్ర విభాగముకూడా మన ముఖ్యకర్తవ్యములలో నొక్కటిగ భావించ వలయును. ఏ జాతియైనను తన వ్యక్తిత్వమును నిలుపుకొనుటకు రాష్ట్రవిభాగ మావశ్యకమై యున్నది. ఇది లేనినాడు మందనుతోలిన పశువులమాదిరి వ్యక్తిత్వమును గోల్పోయి యుండును. తాను బొందఁదగిన మర్యాదలను గౌరవములను తన చేతులతోడనే జారవిడుచుకొనవలసి వచ్చుచుండును. ఈ భాగము నిష్పాక్షికముగ జరిగిననాఁడే దేశము సుభిక్షమైయుండు ననుటకు సందియములేదు. మాట వరసకు - మన యాంధ్ర దేశమున విశ్వవిద్యాలయ మున్నది. పేరునకు మాత్రమది ఆంధ్రవిశ్వ విద్యాలయమే. అయితే ఆంధ్రులకది యెంతవఱ కందుబాటులో నున్నదని మన మాలోచించవలయును. ఆంధ్రభాషను మున్నెవ్వరు చేయఁజాలని మహాకార్యముల నిది యెంతవఱకు సమకూర్చినదని మనము ప్రశ్నించుకొన వలయును. ఇట్లే మనము సరిజూచుకొన వలసిన విషయము లెన్నేని కలవు. అన్నిటి నొక్క పర్యాయముగ సంస్కరింప బూనుట సాహసమగునేమోయను భీతికి తావులేదు. ఇన్నాళ్ళుగ మనము జరిపించిన స్వాతంత్ర్యపు పోరాటమును దలంచికొనినచో నీ విషయము లన్నియు చర్విత చర్వణములుగ మన రక్తనాడుల బ్రసరించినవియై యున్నవి. ప్రతి క్రియోపాయములను మేధావు లన్వేషించుచునే యున్నారు. అయినను మన దాస్యశృంఖలములే మనలను ముందునకు సాగనీయలేదు. మనము పీల్చెడి అస్వతంత్ర వాయువులే ఊపిరాడ నీయలేదు. ఇప్పుడా ప్రతిబంధకము తొలఁగి పోయినది. ఆంగ్లేయులు తమంతట తాముగ ఇటనుండి బయలుదేరినారు. వారిని పునరావృత్తి రహిత శాశ్వత స్వస్థలవాసులనుగ మాత్రము మన మాశింపవలయును.

మఱియు స్వాతంత్ర్యమును సంపాదించు టొకయెత్తు - సంపాదించిన దానిని సుస్థిరముగ నిలబెట్టుకొను టొకయెత్తు. ఈ లక్ష్యమును సాధించుటకే ఐకమత్యము, సహనము, సోదరప్రేమ మున్నగు సదాత్త గుణములకు మన మలవాటు పడవలయును. ఈ గుణసంపద, కేవలము గ్రంథము లందుండుటయేకాక, యిది మనల నావహించునట్లు యత్నింపవలయును. మాటలకంటె చేతలకే యెక్కుడు ప్రాధాన్య ముండవలయును. ఇట్లుగ మన బాధ్యతలను గుర్తించి మన దేశము తలమానిక మగునట్లుగ ప్రవర్తించుటయే మన ముఖ్య కర్తవ్యము.



# శ్రీమతి గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మగారు



ఈమె మద్రాసులో లోగడ కార్పొరేషను సభ్యులుగా నుండిన వేంకటసుబ్రహ్మణ్యగుప్తగారి సతీమణి. దంపతు లిరువురును గుడివాడ మునిసిపల్ సంఘ సభ్యులుగ నుండి కాంగ్రెసు ఆదేశానుసారం రాజీనామా నొసంగిరి. 1927 మద్రాసు కాంగ్రెసులో దేశ సేవికగ పనిచేసిరి. 1930 ఉప్పు సత్యాగ్రహంలో కొంతపనిచేసి 1931లో విదేశ వస్త్రదుకాణముల పికెటింగు జయప్రదముగ గుడివాడలో సాగించిరి. 1932లో గుడివాడతాలూకా కాంగ్రెసు సంఘప్రధమ డిక్టేటరుగ స్త్రీ సత్యాగ్రహదళమును గుడివాడలో నడపి, 3 మాసాలు పోలీసువారి తీవ్ర నిర్బంధములకు కష్టములకు లోనైయుండి 13 గురితో ఏప్రియల్ 1.న 1 సం|| శిక్షను పొంది [illegible] క్లాసులో కఠినశిక్షననుభవించిరి. 1935లో గుడివాడలో హరిజన బాలికా వసతి గృహమును స్థాపించి నేటివరకు పాలకురాలుగ పనిచేయుచున్నారు. నేడు వసతిగృహమున 17 గురు బాలికలున్నారు. 1941 ఏప్రియల్ 1.న సత్యాగ్రహంలో చేరి 50 రూ. జుల్మానా చెల్లించనందున 3 మాసాలు కఠిన శిక్షను పొందిరి. జుల్మానా చెల్లించక శిక్షననుభవింప మధ్యస్థులగుటచే వేలూరు స్త్రీల జైలున సి క్లాసునందుంచబడిరి.

వీరికి గుడివాడలో నియ్యం ఫ్యాక్టరీ యుండుటచే, మిగత ఫ్యాక్టరి వర్తకులు జుల్మానాను కట్టి వేయుటచే [illegible] విడుదలైరి. మరల నవంబరు 15.న సత్యాగ్రహం చేసినందున 16న 6మాసాలశిక్ష విధించబడి 'ఏ' క్లాసులో వేలూరు జైలులో శిక్ష ననుభవించ పంపబడిరి. ప్రస్తుతం ప్రభుత్వం సత్యాగ్రహులను ఎట్టి షరతులులేకుండ విడిచి పెట్టుచున్నందున వీరి 6 మాసాల శిక్ష పూర్తి కాక పూర్వమే 11న విడుదలకాబడిరి. రెండుసార్లు వరుసగా శిక్షితులగుటలో శ్రీ హాలింగరుసతి మినహా ఆంధ్ర స్త్రీలలో నీమె యొక్కరితయే. గుడివాడ గవర్నమెంటు ఆస్పత్రి అడ్వైజరీబోర్డులో సభ్యులు, శ్రీ పునర్వివాహ సహాయక సంఘ కార్యదర్శిగ గుడివాడలో 1956 నుండి అనేక విధముల సేవలు చేయుచు, వితంతువులకు తమ గృహమునందే ఆశ్రయమిచ్చి సేవచేయుచుండిరి. వీరు తమ భర్తగారికి రాజకీయసాంఘిక సేవలో విశేషముగ సహాయము చేయుచున్నారు.



శ్రీమతి న్యాయపతి కామేశ్వరిగారు
బి. ఏ. ఎల్. టి.

# 'బాల' జేజేలు

ఈనాటి బాలలే రేపటి గృహలక్ష్ములు.
"గృహలక్ష్మి"కి కాబోయే గృహలక్ష్ముల
తరఫున నా జేజేలు.

'బాల'

సహాయ సంపాదకురాలు.



యు. పి. రాష్ట్రపు తాత్కాలిక గవర్నరు సరోజినీదేవి క్రొత్త భారత
ప్రభుత్వపు గవర్నరు జనరల్ మౌంట్ బాటన్ ప్రభువు ధర్మపత్ని.

# శ్రీమతి విజయలక్ష్మిపండిట్‌కు ఢిల్లీస్త్రీల వినతిపత్రం



ఇటీవల రష్యాకు రాయబారిగా వెళ్లిన విజయలక్ష్మికి, లేడీ ఇర్విన్ కళాశాలలో ఢిల్లీ మహిళామణులు వీడ్కోలు వినతిపత్రమొసంగిరి.

వరుసగా — ఆర్. కె. నెహ్రూశ్రీమతి, సేనాపతి, విజయలక్ష్మి, హుస్సేనాపతి

వారు చేపట్టియున్నదే వినతిపత్రం.

స్వా
గ
తం

# స్వాతంత్ర్యభారతీ!

ఓ
భారతీ
స్వాగతం!
నవభారతీ
సుస్వాగతం!!
స్వాతంత్ర్య భారతీ
ఘన స్వాగతం!!!

ప్రళయ భీకర
సమర జగత్తులో
విషాద భరిత
అగాధ కడలిలో
నడచి వచ్చిన
విప్లవ నావలో
నవనవోజ్వల
స్వతంత్ర జ్యోతుల
తోరణాలతో
అవతరించిన
ఆవిర్భవించిన
భారతీ
నవభారతీ
స్వాగతం!
సుస్వాగతం!!
ఘనస్వాగతం!!!

'కోదండపాణి'



# స్వాతంత్ర్యము — మన కర్తవ్యము

శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు, మాజీ కడప జిల్లాబోర్డు అధ్యక్షురాలు.

○

ఆగష్టు 15 వ తేదీతో రెండువందల సంవత్సరములనుండి భారతదేశమునకు పట్టియున్న శని వైతొలగిపోతుంది. అంతటితో భారతప్రజల బానిసత్వ మంతమగును. అవిచ్ఛిన్నముగా భారతదేశమును పాలించిన తెల్లదొరలు తమదేశమునకు తరలి పోవుచున్నారు. ఆగష్టు 15 వ తేది భారతీయుల స్వతంత్రి సంపాదన దినము. ఆస్వాతంత్ర్యి ఆనందవుత్సవములలో ప్రతిభారతీయుడు స్వాతంత్ర్య వుద్రేకములతో వుర్రూగుతుంటాడు. వక్కతూరి భారతదేశములో ఒక శతాబ్దమునుండి సాగించిన స్వాతంత్ర్య పోరాటాన్ని సమీక్షించి స్మరించితే ఆదుర్ఘటమైనటువంటి సంఘటనలు స్మరణకు రాకమానవు. మహాత్మాజీ నాయకత్వముక్రింద ఎందరో పురుషులు, స్త్రీలు, బాలురు, బాలికలు తమ అసువులను ఆత్మార్పణ గావించినారు. ముఖ్యముగా స్త్రీలు అహింసాసిద్ధాంతాన్ని అనుసరించి మహత్తరమైన త్యాగాల్ని చేసినారు. తమ భర్తలను, సోదరులను, బిడ్డలను, తుదకు తమ జీవిత సర్వస్వములను అర్పించి ధన్యులైనారు. ఏవుద్యమము నందు కూడా వారిదే పైచెయ్యి. వారి అఖండ త్యాగ ఫలితంగానే నేడు స్వాతంత్ర్యాన్ని పొందగల్గినాము. ఈ ఆనందోత్సాహములో వారు మనతో సమానముగ పాల్గొనుటకు లేకపోయిరే యని ప్రతి భారతీయుడు విచారించక మానడు. ఆకర్మవీరులు కరువైనారు.

మన ఆనందాశ్రువులతో వారికి తర్పణము విడిచి అంజలి మోడ్చి జోహారు లర్పించుదాము. అమరలోకమునుండి మనకు పవిత్రాశీస్సులు అందజేయమని కాంక్షించుదాము. మహత్తర శక్తివంతమైన బ్రిటిషు సామ్రాజ్యాన్ని సడలింప జేసి స్వాతంత్ర్యము పొందితిమి గాని, ఆ స్వాతంత్ర్యము మనము కాంక్షించినది కాదు. అఖండ భరతఖండము ఛేదింప బడినది. ఈ సంతోష సమయమునందు ప్రతిభారతీయుని హృదయము ఆవేదనతో ఆరాట పడుచున్నది. ప్రజలలో అనుకున్నంత వుత్సాహో ద్రేకములు కానరావు. ఇంకను దేశములో కుల, మతముల, పేరిట హత్యాకాండలు జరుగుచునే యున్నవి. అయినప్పటికిని మనము నిరుత్సాహముతో కృంగిపోకూడదు. ఈ దుస్సంఘటనల సహనముతో ఎదుర్కొనాలి దేవతలు అమృత మథనములో ఎన్నిదుర్ఘట సంఘటనలు ఎదుర్కొన లేదు! ఓర్పుతోటి ఆ కష్టాలన్నియూ అధిగమించినప్పుడే



గదా వారలకు అమృతము దక్కి అమరులైనది. అలాగే ఈ విషాద సంఘటనలు సహించవలెను. లేకున్న మహోత్కృష్టమైన వుత్తమ లక్ష్యములను సాధించలేము. మన స్వాతంత్ర్యము సామాన్యమైనది కాదు. ప్రపంచములో కని విని ఎరుగని అఖండ విజయము. అహింసా సిద్ధాంతమనే ఆయుధములో స్వాతంత్ర్యమును సంపాదించితిమి. పవిత్రమైన భారత దేశము తప్ప ప్రపంచములో ఏదేశస్వాతంత్ర్యపోరాటమైనా

హింసా పూరితమే. ఈ శాంతియుత స్వాతంత్ర్య పోరాటము ప్రపంచములో అద్భుత పరిణామాన్ని కలిగించింది. నేడు భారత దేశము సంపాదించిన అఖండ విజయాన్ని ప్రపంచచరిత్ర లో సువర్ణాక్షరాలతో లిఖింపగలరు. ప్రాచీన భారతదేశ పవిత్ర ఆదర్శ ఆశయాలే మనలను గమ్యస్థానము చేర్చినది. ఆ వున్నతమైనటువంటి దృక్పధముతోనే సుస్థిరమైనటువంటి గొప్పవిజయాన్ని సాధించాము. ఎంత త్యాగాన్ని కాంగ్రెసు చేసిందో, అంత సులువుగా ఖాయ్యిదే అజాం జిన్నాసాహెబ్ తనపంట్లాంమడతలు పడకుండానే మొండిపట్టుతో సాధించగల్గినాడు.

సెబాస్ ! ఖాయ్యిదే అజాం.

నీ ధైర్యసాహసాలకు, నీ మంకుపట్టుకు అభినందించ వలసినదే. ఇంచుకంత త్యాగములేకుండానే నీ లక్ష్యాన్ని సాధించగల్గినావు. చల్లగ నీ గమ్యస్థానాన్ని చేరుకున్నావు. కాని రానున్న భవిష్యత్తును గురించి ఇంచు కంతైన ఆలోచించితివా ! ఆలోచించియుంటే ఎప్పుడుకూడా ఈ విభజన అంగీకరించవు. ఏకజాతిని చిందర వందరగా చేయుటయే నీపాకిస్థాన్ నిరూపణమా? పాకిస్థాన్ ప్రత్యేకమైనను మీరందరు భారత పుత్రులే సుమా! దేశ విభజన కొరకు మత వైషమ్యములు రేకెత్తించి భ్రాతృ హత్యలతో నింపడము భావ్యం కాదు. ఇకనైనను దేశాన్ని శాంతి యుతముగా వుంచడము వుభయ వర్గాలకు పరమ ధర్మము. ఈ విశాలదృక్పధముతోటి వ్యవహరిస్తేనే కాని మనస్వాతంత్ర్య సంపాదనా ఫలితము దక్కనేరదు.

ఈ సందర్భములో నాసోదరీమణులకు చిన్నసలహా. ఇప్పటినుండి మనము బానిసలము కాము. స్వతంత్రులము. స్వతంత్రసంపాదనతోటి ముఖ్యముగా మనబాధ్యత మిక్కుటమైనది. స్వతంత్ర భారత దేశ సౌభాగ్య సంపదల అభివృద్ధి పరచుటకు, మాతృదేశ సంరక్షణకు, నిర్మాణ యుక్తముగ మనము ఎన్నో పనులు చేయవలసి యున్నది. ముఖ్యముగా ఆ గురుతర బాధ్యత అంతయు స్త్రీలపైననే ఆధారపడి యున్నదనుట అతిశయోక్తికాదు. మాతృదేశసంరక్షణకొరకు ప్రతి భారతీయుని ప్రోత్సాహించ వలసిన బాధ్యత మనదే. శివాజీ, రాణాప్రతాపులవంటి వీరులుగా మన సంతానాన్ని తర్ఫీదుచేసి దేశము కొసరము సమర్పించవలెను. సమర్పించడమే కాదు, అవసరమైనప్పుడు ఆత్మార్పణ చేయుటకు గూడా సంసిద్ధముగా నుండవలెను. దేశములో సుస్థిరమైన శాంతినిస్థాపించుటకు ప్రతిఇల్లు వ్యాయామ శాలగా మారి స్వయంరక్షణ తర్ఫీదు పొందవలసియున్నది. కనీసము ఇంటికొక్కరైనను భారతసంరక్షణదళములో చేరవలసియున్నది. ప్రతిభారతీయ యువకుడు, యువతి 'ఇదినాదేశం, ఈ దేశసంపదనాది, ఈ జాతీయసంపదాభివృద్ధి నాది, నేను నిరంతరము కృషిచెయ్యడం నాధర్మం' యనిభావించ వలసి యున్నది. అప్పుడే భారత దేశసౌభాగ్య సంపదలు ఇనుమడింపగలవు. ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక, పారిశ్రామిక, నైతిక, ఆధ్యాత్మిక సంపదలన్నియు అభివృద్ధిపరిచినచో కోలుపోయిన ప్రాచిన భారతదేశసౌభాగ్యాన్ని తిర్గి బడయగల్గుతాము. అహింసా సిద్ధాంత బద్ధమైన భారతదేశము సౌహార్ద్ర సందేశములద్వారా ప్రపంచములో సుస్థిర శాంతిని నెలకొల్ప గలదని నేను ఆశించుచున్నాను.

# పల్లెటూరి సౌభాగ్యమే స్వరాజ్యము

● శ్రీ గండికోట రామచంద్రరావుగారు ●

౧

జీర్ణసౌభాగ్య దేశైక జీవకణిక
విపుల విశ్వంభరాదేవికి విడిది ఇల్లు
ఉజ్వలానందకళలకు నూటబుగ్గ!
ప్రకృతిశోభల క్రీడించు పల్లెటూరు

౨

పచ్చినెత్తురు నుడికించు పాటుపైన
రాట్నదారము నీయును రైతుముదుక
కాపులందరు తమకాయకష్టములను
అఖిల రాజ్యాల కిడుచుందు రన్న భిక్ష

౩

నవ్వునాకాశమును జూచి నవ్వుచుండు
కొదమకోడెల అంకెకు ముదముతెందు
హరిత సశ్యాగ్రవీచికి హాయిగనడు
పడుచుకాపుకు స్వర్గంబు పల్లెగాదె!

౪

పసరముల గడ్డిబీళ్లకు బారద్రోలి
వేణువన వీధులందున విసరు పిల్ల
తెమ్మెరల నీలపాటల దీసిపాడు
దేశశాంతికి నదిగొప్ప తెరువు ఏమో!

౫

ముదురుపైరున దాగుడుమూతలాడు
చిలుక జంటలు చేసెకి చిలిపితనము
గున్నమామిడిపై కూయు కోకిలములు
పల్లెపడుచుల హృదయాలు కొల్లగొట్టు

౬.

ప్రణయ భవనంబునకు బూజుపట్టలేదు
కావ్యసృష్టికి నిర్మల కర్మభూమి
విశ్వవిజ్ఞాన తేజముల్ వెలుగుచోటు
పంటభూముల తల్లియా పల్లెటూరు.

★
★ ★

# స్వర్ణ కంకణము

లలిత కళాకరంబు "గృహలక్ష్మి"యె; యయ్యది యాంధ్రకేసరీ
విలసితమై ప్రమోదమయి పెట్టనికోటనుండె నాంధ్రకాం
తల తలమానికంబగుచుఁ దద్బహుమానము కంకణంబు కే
వల పరమార్థనిష్ఠఁగల భామలకే తగు స్వీకరింపఁగన్.

వాజపేయాజుల రామసుబ్బారాయఁడు.



# శారద లేఖలు



**సౌభాగ్యవతి కల్పలతకు**



నెచ్చెలీ!

మన భారతభూమికి స్వరాజ్యముపలబ్ధమైన యీ సర్వజిన్నామ సంవత్సర అధిక శ్రావణ బహుళ చతుర్దశి శుక్రవారము 1947 సంవత్సరం ఆగస్టు 15 వ తేదీ మనకెల్లరకు సంతోషకరమైనది. ప్రస్తుతమున కిది అధినివేశ పరిపాలనమే కావచ్చును. కాని యిందు సంపూర్ణ స్వాతంత్ర్యతా ప్రాప్తికి తెన్నులు లేకపోలేదు. కాన భారతదేశమున నేడు తెల్లవాని పరిపాలన తెల్లవారినది. ఇకనుండి మన ప్రజలు కోరుకొన్నవారే శాసన సభాప్రతినిధులు. ప్రతినిధులుచేసిన తీర్మానములే చట్టములు. ప్రజలు శాసనసభ్యుల నెన్నుకొనుటలో కొంచెము పరిశీలనబుద్ధిని వినియోగించిరేని సుపరిపాలితమగు స్వపరిపాలన యేర్పడి భారతీయులకు క్షేమ లాభముల చేకూర్చగలదు.

అరువదేండ్లుగా భారతజాతీయ మహాసభ (ఇండియన్ నేషనల్ కాంగ్రెస్) ఏ మహాఫలమునకై యనంతకృషి చేయుచున్నదో, ఇరువదేడు వత్సరములుగ మహాత్మాగాంధీ ఏ మహాద్భాగ్యముకొరకు కఠోర తపస్సు చేయుచున్నాడో ఆ మహాఫలము, ఆ మహాద్భాగ్యము నేటికి చేకూరినది. ఈ స్వరాజ్యప్రాప్తికై ఈ పారతంత్ర్య శృంఖలా విచ్ఛేదనకై భారతమాత పుత్రరత్నము లెందరు ఉరికంబములెక్కిరో, ఎందరు అండమాను దీవులలో కదలలేని కడగండ్ల ననుభవించిరో, ఎందరు కారాగృహములలో క్రుగ్గిరో, ఎందరు తుపాకిగుండ్ల కెరైరో, ఎందరు కొరడాదెబ్బల పాలైరో, ఎందరు లాఠీ ప్రహారములకు గురైరో, ఎందరు ఆస్తిపాస్తుల కోల్పోయిరో! వివరించుట దుస్తరము.

1857 సంవత్సరపు సిపాయీల తిరుగుబాటు మొదలుకొని 1942 సంవత్సరము ఆగస్టు విప్లవమువరకు సాగిన యీ స్వాతంత్ర్య సంగ్రామ పరంపరలలో భారతీయులు చూపిన త్యాగసాహసములు అసాధారణములు.

వందేమాతరోద్యమము, హోంరూలు ఉద్యమము, అసహాయోద్యమము, లవణసత్యాగ్రహోద్యమము క్విట్ ఇండియా ఉద్యమము, భారతదేశమున ఎన్ని స్వాతంత్ర్య తరంగము లువ్వెత్తుగలేచి ప్రజల నుఱ్ఱూత లూగించినవి! ఎందరియసువు లీయుప్పెనలో కొట్టుకొని పోయినవి! సమకాలికుల ధీబలము భుజబలముచూచి వీరే స్వాతంత్ర్య ప్రాప్తిని చేకూర్చినవారని మనము భ్రమపడకూడదు. ఈ స్వాతంత్ర్య సమరమునకు తమ నిండుప్రాణముల నర్పణచేసిన దేశభక్తుల అస్తికలతో నిర్మితమైనదే ఈ స్వాతంత్ర్య సౌధము.

స్వాతంత్ర్యము మా జన్మహక్కని నొక్కి వక్కాణించిన దాదాభాయి నౌరోజీ, బాల గంగాధర తిలక్, లాలా లజపతిరాయ్, చిత్తరంజనదాసు, మోతీలాల్ నెహ్రూ, మహదేవదేశాయ్, మదనమోహన మాలవ్యా, మాతా కస్తూరిబాయ్ మున్నగు మహనీయులు లేరు. తెల్లదొరలను తన వెఱపు మఱపులచే తల్లడబెట్టి ఇరువదిలక్షల శిక్షిత సైన్యమును మాతృదేశమునకు ప్రసాదించి కృతార్థుడైన సుభాషచంద్రబోసు మన మధ్యలేడు. కాని వారి పవిత్రాత్మలు మాత్రము నేటి మహోదయమును పలక్షించుచున్నవనుటకు సందియము లేదు.

భారతావనికిది మహా పర్వదినమే. ఆనందోల్లాసములతో గడపవలసిన దినమే. కాని నిన్న నేటివరకు మనతో కలిసిమెలిసియుండి పరదేశములలో తామును భారతీయుల మనిపించుకొనుచు వ్యవహరించుచున్న ముస్లిము సోదరులు క్షణములో మనకు వేరవారై పాకిస్థానమును నిర్మించుకొని వేరింటి కాపురము పెట్టుకొనుటమాత్రము విషాదకర విషయము. ఈ సంతాపకరగాథకు బ్రిటిషు గవర్నమెంటు వారిచ్చిన చేయూతనుబట్టి యిటీవల మన దేశమున చేకూరిన కష్టము లిన్ని యన్నిగావు. హత్యలు, దోపిడులు, గృహదాహములు, స్త్రీల అపహరణలు, భంగపాటులు ఒకటేమి ఎన్నియో అకృత్యములు బాహాటముగా సాగుచున్నవి. ఈ పరిస్థితిచూడ ఇన్నూరేండ్లకు పూర్వము ఆంగ్లేయులీదేశము ప్రవేశించునాటికీ దేశమెట్లుండెనో నేడా పరిస్థితిలోనే దేశమును విడనాడుచున్నారనియు, ఈ అంతఃకలహములకు వీరే కారకులనియు, వీరింకను ఈ దేశమునతిష్ఠివేయు నిమిత్తమే ఇట్టి మతకలహముల లేవదీసిరనియు, భారత ప్రజానీకము వీరి చిత్తశుద్ధిని శంకించుచు పలుకుచున్నది. సరి యీ మిత్రభేదము వారుసాగించినదేయైనను అంతతప్పును వారిపై ద్రోయుట మాత్రమేమి సబబు? వారు మిత్రభేదము చేసిరే పో; మనబుద్ధి యేమైనది? మనలో మనకు ఐకమత్యమున్నచో విఫలతంత్రము లేమిచేయగలవు? మానవునకు స్వార్థపరత్వము కలిగించినంతహాని వేరేదియు కలిగించదు. స్వార్థపరత అనునది పయోముఖ విషకుంభము. పైకిది ఆకర్షణీయముగనేయుండి అడియాసలకు లోనుచేసి వివేకశూన్యత కలిగించును. వివేకశూన్యు లేమిచేయరు? నేడు భారతావని ప్రబలతమములైయున్న మతకలహములన్నియు నీ వివేకభ్రష్టులచే చేయబడుచున్నవే. హిందూ మహమ్మదీయు లీదేశమున నెన్ని శతాబ్దములనుండియో కలిసి మెలిసి యున్నారు. మతభేదము, మాటభేదము, వారిలో నెన్నడు పొరపుల పెట్టించలేదు. వారిలో వారికి విభేదములేయున్న ఇంతకాలముగ వారు ఇరుగు పొరుగుల నెట్లు నివసించగలిగిరి? నేటికివారు పరాయివారైరి. ఇంతకును అనుమానము పెనుభూతము. నమ్మకము చెడినవెనుక అమ్మ పెట్టినఅన్నమైనను అనుమానమునకే కారణమగును. ఏమనుకొనిన నేమిలాభము? మహాత్మగాంధీ సిగపూవు వాడకుండ స్వరాజ్యమును సమకూర్చ సోదర దేశీయులలోనే విభేదము లేర్పడి పూజ్య మాతృభూమి చెక్కలు ముక్కలుగా వికృతము చేసికొని పంచుకొనవలసి వచ్చినది. ఈ విభజనబీభత్సమే లేకున్న నేటి మహోత్సవ మితోధికానంద భరితమై యుండెడిది కాదా? భారతావనికాభాగ్యము లేదు. లేదు. ............ కానిమ్ము కాలమెప్పటికైన మంచిది కాకూడదా? అఖండ భారత వర్షమేర్పడ గూడదా? అఘటనాఘటనా సమర్థుండగు భగవంతుని మీదనే ఈ భారము వేయుదము.

అసంఖ్యాక స్వాతంత్ర్య యోధుల కర కమలంబుల నలంకరించి చరిత్రాత్మక సంఘటనల నెన్నిటినో తొలిగించి యెన్నియో విధినిషేధములకు, ప్రభుత్వ సేవకుల బలాత్కార పీడనలకు ఆస్పదమైన మన

త్రివర్ణ జాతీయపతాక నేడు విజయ సూచకముగా ప్రభుత్వ భవనము లన్నిటిపై నధిష్ఠించి స్వాతంత్ర్య జ్యోతుల వెదజల్లుచున్నది. ఎంతటి మనోహర దృశ్యము.

నిన్నటి వఱకు ప్రజలు వేరు, ప్రభుత్వము వేరు. నేడు ప్రజలే ప్రభుత్వము, ప్రభుత్వమే ప్రజలు. త్రివర్ణ పతాకను చేపట్టిన వాని నెల్ల చావగొట్టిన రక్షక భటులే నేడా పతాకను తమ చేతులలో బట్టి యూరేగు చున్నారు.

మహాత్ముడు కృతార్థుడు. తన జీవితార్థమైన స్వాతంత్ర్య ఫలమును పొంద గలిగినాడు. మనము కృతార్థులము. ఆపూజనీయ వ్యక్తికి సమకాలికులము కాగలిగినాము. మిత్రమా! వింటివో లేదో మన జాతీయ పతాకములో కొంత మార్పు కలిగినది. పతాకములోని త్రివర్ణములట్లే యుండుకాని దానిపై ముద్రింప బడు చున్న రాట్నము తనకు లాంఛనములైన కదురు దారముల పోగొట్టుకొని కేవలము చక్రముగా మాత్రము నిలిచి పోయినది. ఈ చక్రము గూడ రాట్నపాకుల చక్రము గాదు. పూర్వము అశోక చక్రవర్తిచే సారనాథ్ బౌద్ధస్థూపముపై చెక్కింప బడిన ధర్మచక్రమీ చక్రము. అశోకుడు కళింగ యుద్ధమునందు దారుణ హింసా కాండను భయంకర రక్తపాతమును చూచి మనసు కరగినవాడై హింసా ప్రవృత్తియందు విరక్తిజెంది అహింసయే పరమ ధర్మమైన బౌద్ధమతమును స్వీకరించెను. ఈ అహింసా ధర్మమును తానవలంబించుటయే గాక దేశ దేశములయందు వ్యాప్తి గాంచుటకు ప్రచారకుల పంపి అపార కృషిసల్పెను. ఆనాటి అహింసా వ్రతుడాతడు, ఈనాటి అహింసా యోగి మన మహాత్ముడు. మఱియు మన స్వాతంత్ర్య సమరము గూడ అహింసా యుతమైనది. కాన అహింసా నిరతుడగు అశోకుని నాటి ధర్మచక్రము మనజాతీయ పతాకపై ప్రతిష్ఠింప బడినది. ఈ విధముగా మనస్వాతంత్ర్య పతాకమునకు ప్రాచీన అహింసా చరిత్రముతో బాంధవ్యము కూర్చబడినది. ఇది యెంతసముచితమో అంత హర్షదాయకము. భారతీయుల చిరతపఃఫలమై స్వాతంత్ర్యము సమకూడినది. భారతావని విదేశీయ పరిపాలనా పీడచే, భయంకర సంగ్రామ రాపిడిచే కరిమ్రింగిన వెలగ పండువలె నున్నది. ఈ శిథిల భారతి నుద్ధరించుటకు ఎంతయో సమైక్యతతో సంఘీభావముతో అపార కృషి చేయవలసి యున్నది. స్వార్థచింతలు, అధికార వ్యామోహములు, కులతత్వములు లేక భారత నరనారీమణులు లెల్లరు స్వాతంత్ర్య సాధనకు కృషిచేసినటులే ఈ అభ్యుదయ కార్యమునకును కృషిచేసిననాడే భారత వర్షము సకల సంపత్పరి పూర్ణమై, సకల విద్యా శోభితమై, సకల కలావిభూషితమై, అలరారగలదు. వందే మాతరమ్. స్వతంత్రభారతికీ జయ్.

1947 ఆగష్టు

మిత్రురాలు,
'శారద'



# గృహలక్ష్మి సంకీర్తనం





గృహిణు లందరు కూడ
గృహలక్ష్మి చదవాలి

గృహలక్ష్మి పాటలు
గృహిణు లందరు పాడు

గృహలక్ష్మి ఆటలు
బాల బాలిక లాడు

బ్రతుకు దెరువొకటి
గృహవైద్య మొకటి

ఈ రెండు శీర్షికలు
వుపయోగకరములు.

పాకకళ మొదలుగా
అన్నియూ అన్నేను

శారదలేఖలు
రాష్ట్రవిషయాలు

గృహలక్ష్మి సేవెంతో
చేయాలి—నేడు

స్వాతంత్ర్యదేశంబు
ఇండియా నేడు.

రచన : యం. సు.

# వందేమాతరం



డాక్టరు లక్ష్మీదేవి, బళ్ళారి.

ఆహా, ఏమి ఈ చిత్రము! ఏమి ఈ జయజయ ధ్వనులు! ఏమి ఈ ఆందోళన! భూమ్యాకాశాదులు జయజయ ధ్వనులచే మారుమ్రోగు చున్నదే? వాస్తవంగా దీనికి ఏదో ఒక కారణముండియే తీరును.



ఎక్కడ చూచినను జనసమూహములే! వారి ముఖ తేజస్సున సంతోషతరంగములు పొరలుచున్నవి. వారి హృదయములు వేగముగా పొరలుచున్న భావములచే, ఆతురపడుచున్నవి. ఇందులకు కారణం రాబోవు ఆగస్టు పదిహేనవ తేదియే అయియుండవచ్చు. ఆనాడు భారతమాత తన దాస్యశృంఖలములను త్రెంచుకొని స్వతంత్ర పదవిని పొందుచున్నది. భారతీయులందరు పరరాజ్యపరిపాలననువదలి స్వరాజ్యపరిపాలనలో చేరుదురు. భారతదేశం ఆబాలగోపాలము అట్టి శుభదినమునకై వేచియున్నారు. జయజయ నినాదముల కిదియే కారణము.

స్వరాజ్య సంపాదనకై సుమారు అరువది సంవత్సరములు తీవ్రకృషిసల్పిన పుణ్యమూర్తి మన బాపూజీ. ఆ శాంతమూర్తి అహింసా తత్వమునే తన ఆయుధముగా గైకొని శాంతి సమరమున పోరాటముచేసి, తనధైర్యస్థైర్యములతో భారతదేశపు స్త్రీ పురుషులకు



ఆదర్శనీయుడై దేశదాస్యవిముక్తికై పోరుసల్పెను. మహాత్ముడు సల్పిన శాంతిసమరమును భారతయుద్ధమునకు పోల్చవచ్చును. భారతయుద్ధమున కౌరవపాండవులకు శ్రీ కృష్ణుడు రాయబారి. మహాత్ముడని బిరుదుగాంచిన గాంధి కలియుగభారత శాంతి సమరమున ఆంగ్లేయభారతీయులకు రాయబారి. మహాభారత యుద్ధభూమి నలంకరించినవారు భీష్మ ద్రోణ విదురాదులు. శాంతిసమరము నలంకరించిన పుణ్యమూర్తులు అజాద్, పటేల్, జవహర్, రాజాజి మున్నగువారు. ఆనాటి యుద్ధసామగ్రులు రథ గజ తురగములు,

ఈ నాడన్ననో రామనామమే. ఆనాడు శ్రీకృష్ణుడు అర్జున సారథి. ఇప్పటి సారథి మహాత్ముడు, జవహర్. ఆనాటి భారతయుద్ధమున సమసినవారు వేనకువేలు. ఈనాటి శాంతి సమరమునకు తమప్రాణముల ధారబోసినవారు ఘనతకెక్కిన భారతమాతపుత్రులుదాసు, విఠల్ బాయి, పటేల్, మోతిలాల్. మరియు వేనకువేలు స్వయంసేవకులు శ్రీమతులు కస్తూరిబాయిగాంధీ, కమలానెహ్రూలు తమ అపారమైన దేశసేవచే స్త్రీ లోకమునకు ఖ్యాతికి తెచ్చిరి.

ఆగస్టు పదిహేనవతేది యావత్ భారతీయులందరు దేశకళ్యాణ దినముగా మంగళ వాద్యములతోను, జయజయనినాదములతోను, వేదఘోషతోను, భారతమాతను పూజించవలెను. పురములు, గృహములు, భవనములు, దేవాలయములు పచ్చని పందిళ్ళ తోను, మామిడి తోరణములతోను అలంకరించి భారతమాత కళ్యాణమే దేశకళ్యాణ ముగా నెంచి భారతీయులందరు తమను వీడిన సోదర సోదరీమణులను జ్ఞప్తికి తెచ్చుకొని వారి ఆత్మశాంతికోరుచు భారతమాతను పూజింతురు గాక.

భా ర త మా త కు జై.



[శ్రీమతి డాక్టరు లక్ష్మీదేవిగారు బళ్ళారి వాస్తవ్యురాలు. లోగడ శాసనసభలో (1937 - 45) మద్రాసు శాసనసభా సభ్యురాలుగా నుండిరి. విద్యాధికురాలు. గొప్ప సంఘ సంస్కారిణి. వీరు దయతో నీ వ్యాసమును వ్రాసి స్వాతంత్ర్య సంచికకై పంపిరి.

గృ॥ సం॥]

# స్వతంత్ర భారతం

శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు, యం. యల్. ఏ.

ఆగస్టు 15వ తేదీతో భారత దేశములో ఒక నూతన శకము ప్రారంభము కాగలదు. దాదాపు రెండు శతాబ్దముల నుంచియున్న విదేశీ ప్రభుత్వం నాటితో అంతరిస్తుంది. కాని అంతమాత్రముతో దేశములోని ప్రతిమానవునికి స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లభించినట్లుకాదు. భారతదేశస్వాతంత్ర్యముతోబాటు దేశం విభజింప బడిన సంగతి భారతీయ స్త్రీపురుషులు విస్మరింపరాదు. పాకీస్థాన్, యిండియాలు రెండు ఐక్యభారత భూమిగా యుండే శుభదినముకోసం భారత సంతానం నిరంతర కృషిసాగించాలి. అందుకు ముఖ్యంగా యిండియా పాకీస్థానములలోని అల్పసంఖ్యాక సంఘాలు ఆయా ప్రభుత్వాలతో సుహృద్భావము గలిగి సహకారం చేయాలి. అధిక సంఖ్యాక ప్రభుత్వాలు అల్పసంఖ్యాక సంఘముల రాజకీయ హక్కులను గమనించి వారిభాష, ఆచారాలు, సంప్రదాయాలు, సంస్కృతి అన్నినిరాటంకంగా వర్ధిల్లడానికి దోహదం చేయాలి. అప్పుడే ఒకరి యందొకరికి పరస్పర విశ్వాస సుహృద్భావములు కలగడానికి సావకాశముంది. అట్టిసూచన లిప్పటికే యిండియాలోను పాకిస్థాములోను కూడ గోచరిస్తున్నవి. జిన్నాసాహేబు యొక్కయు, ఖాలీకుజ్జమాన్ యొక్కయు ప్రకటనల వలన ముస్లిం లీగువారు కొంత మార్దవ భావమును పూనినట్లు అర్థమగుతున్నది. యిండియాలోని రెండుభాగములును కొలదికాలం పరస్పర ప్రయోగములను సంబంధించిన విషయాలలో సహకారం చేయ గలిగిన యెడల ఒకరిమీద నొకరికి తిరిగి విశ్వాసం కలిగి యిండియా యేకమై ఐక్యభారత భూమిగానూ తనప్రపంచ వ్యవస్థలో శాంతి భద్రతలు నెలకొల్పడానికి సహకారి కాగలదు.

## అంటరానివారు.

తరతరాలనుండి ఎంతమంది సంస్కర్తలు ప్రయత్నించినను పరిష్కారంకాని సమస్య మరియొకటుంది. అది అంటరాని తనము. ఆసమస్య పరిష్కారం కాకపోతే గ్రామ గ్రామము, పల్లెపల్లె అశాంతికి మూలకందమాతుంది. యిండియా రెండుగా విభజింప పడటంకాదు. ప్రతిగ్రామము రెండుగా విభజింపబడుతుంది. ప్రతియూరు ఒకరణరంగ మాతుంది. పల్లెటూళ్ల పెద్దలిది గ్రహించాలి. లేదో? దేవాలయాలలో హరిజనులను ప్రవేశపెట్టి నంతమాత్రాన యీసమస్య పరిష్కారంకాదు. హరిజనులకు ప్రత్యేకం వాడలు యుండ కూడదు. మాలపల్లెలు మాదిగగూడెములకి స్థానములేదు. అవిగ్రామములలో కలసిపోవాలి. "మేము తక్కువ వాళ్లము, మమ్ములను పై కులాలవారు తక్కువ చూపు చూస్తున్నారు" అనేభావం వారిమనసులలోనుండి పోవాలి. ఆభావమే ఒక అగ్నిపర్వతం. పెద్దకులాలవార మనుకొనే వారు హరిజనుల మనస్సులనుండి ఆభావాన్ని తొలగించకపోతే అది ఎప్పుడో పగిలి భగ్గుమంటుంది. హరిజనుల ఆర్థిక పరిస్థితులను కూడ బాగుచేయాలి. జమీందారి విధానం రద్దుకావడం ముఖ్యంగా హరిజనుల ఆర్థికస్థితిని పెంపొందించడానికి తోడ్పడాలి. బంజరభూములను హరిజన సంఘాలకిచ్చి ప్రభుత్వం పెట్టు

బడిపెట్టి వ్యవసాయం చేయించాలి. ప్రభుత్వం పెట్టిన పెట్టుబడి యిరుపై ముప్పది సంవత్సరాలలో తీర్చుకొనే ఏర్పాటు చేయాలి. హరిజన బాలబాలికల విద్యాబోధనమునకు యీపాఠశాలలు చాలవు. దేశాభ్యుదయమును కోరే యువతీ యువకులు నిరక్షరాశ్యతను నిర్మూలించడానికి నడుముకట్టి రాత్రిపాఠశాలలలో వారికి విద్యాబోధనం చేయాలి. కళాశాలలలో పట్టభద్రులైనవారు ఒక సంవత్సరము యీపని చేస్తేనేగాని యుద్యోగానికి అర్హులు కారని ప్రభుత్వం శాసిస్తే చక్కగా యీకార్యక్రమం కొనసాగుతుంది. మద్యపాన నిషేధోద్యమ ప్రచారమునకు యేర్పాటు చేయబడిన సిబ్బందికి కూడ యీపని అప్పగించవచ్చును.

డాక్టర్ అంబేద్కర్ సమిష్టనియోజక వర్గముల నందించడం శుభసూచకం. స్వతంత్ర భారతంలో రాజకీయంగా కూడా హరిజనాభ్యుదయమున కేమి అడ్డంకు యుండదు.

## స్త్రీల భవిష్యత్తు

భారత దేశ స్త్రీలకు సంఘంలో గౌరవ మర్యాదలు యెక్కువగా కలవని నేనంగీకరిస్తాను. వారిని చులకనగా చూడటంగాని, నిరశించడంగాని, అనాగరికతగాను, క్రూరత్వంగాను భావింప బడుచున్నది. కాని ఆర్థికంగా వారు చాలా నీచస్థితిలో నున్నారు. హిందూన్యాయశాస్త్రం ప్రకారం వారికి ఆస్తిపాస్థులలో హక్కులంతగాలేవు. పురుషులతో బాటు స్త్రీలను సమాన భాగస్వామినులుగా చేసినయెడల యేమి ప్రమాద ముండదను కుంటాను. స్త్రీలనిస్సహాయత దానితో రూపు మాస్తుంది. కట్నాల గొడవ పూర్తిగా తగ్గిపోవును. యిందువల్ల ఆడపిల్లల్ని గన్నతల్లిదండ్రులు దిగులుపడ వలసిన అవసరముండదు. కాని పురుషులతోబాటు స్త్రీలకు సమాన భాగాలివ్వడంలో కొన్నిచిక్కులు కలవని కొందరంటారు. వాటిని సరిగా పరిష్కరించకపోతే స్త్రీలస్థితి దుస్థితికి రావడమేగాక ఆడుబిడ్డలను గన్న తల్లిదండ్రులకు అంతులేని కష్టాలురాగలవు. కట్నాల్ని నిషేధిస్తూ చట్టం చేస్తేలాభం లేదు. పెండ్లికొడుకులను చీకటి బజారులలో అమ్మకుంటారు. సింధురాష్ట్రములో యిపుడలాజరుగుచున్నది.

వితంతు స్త్రీపునర్వివాహము చేసుకొన్నప్పటికి చనిపోయిన భర్తఆస్థి ఆమెకు సక్రమించేటట్లుండాలి. భార్య చనిపోయిన, భర్తతిరిగి పెండ్లిచేసుకుంటే మొదటి భార్యఆస్థి ఆయనకు రావడములేదా? యిదిన్యాయం. సంఘంలో యిటువంటి న్యాయాలను గమనించక పోవడం మానవ స్వేచ్ఛను అరికట్టడం.

విడాకుల చట్టం భారతదేశంలో యెప్పుడూ దుర్వినియోగం కాదు. అత్యవసరసందర్భాలలోనే ముఖ్యంగా స్త్రీలాచట్టాన్ని వినియోగం చేసుకుంటారు. ఆచట్టం వలన భారతీయ కుటుంబాలు విచ్ఛిన్నంకాగలవని ఎవ్వరు అనవసరంగా భయపడనక్కర లేదు. మన ఆచార సంప్రదాయములకు, గౌరవ మర్యాదలకు భారత స్త్రీలెన్నడు భిన్నంగా ప్రవర్తించరు. స్వతంత్రభారతంలో శాసన సభ్యులీవిషయాన్ని చక్కగా గమనింతురుగాక.

## ఐశ్వర్యములో హెచ్చుతగ్గులు.

యీసమస్య చాలా పెద్దది. దీనిరూపు మాపితీరాలి. అధమం అంత హెచ్చుతగ్గులు లేకుండా నైనా చూడాలి. సామ్యవాద సిద్ధాంతములపైన ఆధారపడిన ప్రజాస్వామ్య రాజ్యాంగ శాసనం ద్వారా నిర్మింపబడే నూతన శాసన సభలీ సమస్యను ఆమూలాగ్రంగా పరిష్కరించ గలవని ఆశించ వచ్చును. అలాకాకపోతే యీవిభేదాలను పురస్కరించుకొని వర్గపోరాటాలను పెంపొందించే విచ్ఛిన్న కారకులకు మననాయకులు చేయూత నిచ్చిన వారౌతారు. ఎన్నిఆర్డినెన్సులు పెట్టిన, ఎంతనిర్బంధ విధానము సాగించినా ఏమీ ప్రయోజనముండదు. ప్రతివారికి కడుపునిండా కూడు, వంటినిండా బట్ట, నిలవటానికి నీడలేని స్వాతంత్ర్యం స్వాతంత్ర్యంకాదు. యివిలేనివారికి పరాయి పరిపాలనమున్నాయొకటే, మనవారి పరిపాలన మున్నాయొకటే అనిపిస్తుంది.

ఈప్రధానసమస్యలను సరిగా పరిష్కరించ గలిగినప్పుడే యిండియాలోని ప్రతివ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యములను పొందినట్లు అవుతుంది. ఆ సుముహూర్తం త్వరలో రాగలదనే భ్రాంత స్వాతంత్ర్య సమరంలో కడచిన రెండున్నర శతాబ్దములనుండి వీరోచితంగా పాల్గొన్న నరనారీమణులాశిస్తున్నారు.

# స్వాతంత్ర్య పోరాటమున ఆంధ్రస్త్రీలు పడినపాట్లు

శ్రీమతి నడింపల్లి శారదాకుమారిగారు





[ఆంధ్రదేశంలో ఉన్నవ దంపతుల నెరుగనివారుండరు. శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు తమ విద్యార్థి దశనుండీకూడ, ఆంధ్రదేశంలో బయలుదేరిన నవలోద్యమాలు చేబట్టి ఆచరించి, ప్రబోధం చేసినవారు, చేస్తున్నవారు. వారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు వారికి ప్రథమంనుండి చేదోడు వాదోడుగా ఉంటూ, 1920 నుంచి కాంగ్రెసు రాజకీయాలలో తీవ్రంగా పాల్గొంటూ అనేకసార్లు ఖైదుకూడా అనుభవించారు. సహాయనిరాకరణపు పొంగుతగ్గిన తర్వాత ఈ దంపతులు గుంటూరులో శారదానికేతనం నెలకొల్పి - నాటినుండి ఎడతెగకుండా స్త్రీ విద్యావ్యాప్తి గావిస్తున్నారు. ఏనాటికైనా ఈ సంస్థ - కార్వే స్థాపితమైన విద్యాలయంవలె "శారదావిశ్వవిద్యాలయం" కాదగినది. అట్టి శ్రీ లక్ష్మీబాయమ్మగారి జీవితంపోకడ, మొత్తంమీద ఆంధ్రస్త్రీల రాజకీయప్రచారాన్ని గూర్చి ఈవ్యాసం శారదానికేతన విద్యార్థిని చిరంజీవి నడింపల్లి శారదాకుమారిచే రచింపబడినది. గృ॥ సం॥]

లోకములో మానవుడు గట్టిగా ప్రయత్నించినచో సాధింపనిదిలేదు. మానవుడు సర్వశక్తిసంపన్నుడు. కాని యాశక్తి క్షీరాబ్ధిని తరచగా తరచగా నమృతము పుట్టినట్లు, ప్రయత్నింపగా, ప్రయత్నింపగా నీజన్మలో కాకున్న, మరియొక జన్మమందైనను పొందగలమని మన పెద్దలు చెప్పుదురు. సుమారు ఇరువది సంవత్సరముల క్రిందటనుండి కాంగ్రెసు సంస్థయేర్పడి స్వాతంత్ర్యమునకై పాటుపడుచున్నది. అప్పుడు వారికి తమ జీవిత

కాలములో నా స్వాతంత్ర్యమును పొందగల్గుదుమన్న యాశ లేదు. కాని ఇకముందుండెడు భారతీయులైనను స్వాతంత్ర్యము ననుభవింపగల వారలను కేవల ధర్మబుద్ధితో చేసినట్లు కాన్పించుచున్నది.

60 సంవత్సరముల క్రితమే కాంగ్రెసుసంస్థ యేర్పడినను, దాని విధానము చట్టబద్ధమైయున్నను, అహింసా సిద్ధాంతమును మూలసిద్ధాంతముగాఁ జేసికొని యుండలేదు. మహాత్ముఁడు, అహింసా సిద్ధాంతమునకు ప్రాముఖ్యతను దీసికొనివచ్చి, యీ స్వాతంత్ర్యోద్యమమునకు జతపఱచి యున్నాఁడు. ఇప్పటికి 2500 సంవత్సరములకు పూర్వము బుద్ధుఁడు మన దేశములో బోధించి యహింసా సిద్ధాంతమునకుఁ బ్రాముఖ్యతఁ దెచ్చియుండుటచేత భారతీయులకు, ఈ సిద్ధాంతము శరీరమున జీర్ణించియున్నది. ఈ సిద్ధాంతము భారతీయులకు నచ్చినట్లు ప్రపంచమున మరేజాతికి నచ్చదు. ఈ సిద్ధాంతముయొక్క గొప్పదనము భారతీయులకు సంపూర్ణముగా నర్థమైనది. మరియు నా సిద్ధాంత మాచరించి చూపుటకును, భారతీయులకే యెక్కుడ వకాశములున్నవి. అందుచేతనే గాంధీమహాత్ముఁడు, ఒక పెద్ద రాజ్యముతో పోరాడగల్గినాఁడు. ఆ మహా రాజ్యమునకుఁగల సైన్యములును, ఫిరంగులును, యుద్ధనావలును, బాంబులును నాతని నేమియుఁ జేయఁజాలక పోయినవి. ఇట్లు 26 సంవత్సరములు ఘోరమైనపోరాటము జరిపియున్నాఁడు. ఈఅహింసా పోరాటములో నొక యాంగ్లేయుడైన చంపఁబడి యుండలేదు. ఆంగ్లేయులు సత్యాగ్రహుల నెన్నివిధముల బాధించినను, సంపూర్ణముగా తమకుఁగల తను ధనప్రాణము లర్పించిరేగాని, హింసారూపక ప్రతిక్రియ నొకదానినేని చేయలేదు. ఇదియే మహాత్ముఁడు నెలకొల్పిన యహింసాసిద్ధాంతము. ఇదియే లేనిచో భారతీయులకు స్వాతంత్ర్యము గగన కుసుమము. హింసచేతను, పరాక్రమముచేతను, వీరీఫలమును సాధింపగలిగి యుందురా! కాంగ్రెసున కీ యహింసా సిద్ధాంతముయొక్క తోడ్పాటువలననే బంగరునకుఁ దావి యబ్బినట్లు ముదావహ మగుచున్నది.

ఇట్టి భారతీయ యహింసా రూపకత్యాగముఁ గాంచియే యాంగ్లేయులకు హృదయపరివర్తనము గల్గినది. భారతీయులకు స్వాతంత్ర్య మిచ్చివేయ వలయునని పార్లమెంటులో తీర్మానించి 15-8-47 తేదీన భారతీయులకుఁ బట్టాభిషేకము చేయఁబోవుచున్నారు. కనుక నాదినము మనకు పండుగవంటిది. ముఖ్యముగా 26 సంవత్సరములనుండి, యనేకమంది మహానుభావులగు పురుషులు, పూజ్యురాండ్రగు స్త్రీలును, అష్టకష్టముల కోర్చి, స్వార్థచింత వదలి, ఏ స్వాతంత్ర్యము తమజీవిత పరమావధిగా పాటుపడిరో, అట్టి స్వాతంత్ర్యము కలుగఁబోవు చున్నది. కాన మనమందరము సంతోషింపవలసిన విషయము,

'కష్టేఫలీ' యన్నట్లు వారల శ్రమ నేటికి ఫలించినది. మరియు నీ స్వాతంత్ర్యసమరరంగమున నెన్నియో ప్రాణము లర్పింపఁబడినవి. అట్లు మానవసేవకై ప్రాణములను తృణప్రాయముగఁ ద్యజించి, కీర్తిగన్నవారల యాత్మకు శాంతికలుగ నీ శుభసమయమున బ్రార్థింపవలయును. లేనిచో కృతఘ్నుల మగుదుము.

సహాయ నిరాకరణమనగా ప్రభుత్వమునకుఁగాని ప్రభుత్వోద్యోగులకుగాని యేవిధమైన సహాయముఁజేయ నిరాకరించుటయే. ఇది 26 సంవత్సరములకు క్రింద చేయబడినది. అప్పడినుండియే కాంగ్రెసున కెక్కువ ప్రచారముకల్గినది. స్వాతంత్ర్యోద్యమములో నాంధ్రదేశ మన్నివిధముల ముందంజవేసి మహాత్ముని వినుతులఁగన్నది. అందు ముఖ్యముగా స్త్రీలు చాలమంది బయలుదేరి యీ కాంగ్రెస్ సిద్ధాంతముల ప్రచారముసల్పిరి. అందును అహింసా ప్రధానము గావున పురుషులకన్న స్త్రీలకే ఎక్కువ ప్రాధాన్యము కల్గినది. కనుక నాంధ్రస్త్రీలు తమ యవకాశమును జారవిడువక సంపూర్ణముగా వినియోగించుకొనిరి. తమ యబలాత్వము నొకచోటనుంచి పురుషులతోభాటు స్త్రీలను గవర్నమెంటున కేవిధమైన సహాయము చేయరాదనియు, ఉద్యోగములను మానవలసిన దనియు, ఖద్దరు వస్త్రములనే ధరింపవలెననియు, విదేశవస్తుబహిష్కరణ మొనర్పుడనియు, స్వదేశీయవస్తువులనే యుపయోగింప వలయుననియు మొదలగు సిద్ధాంతములను ప్రతి జిల్లాలోను ప్రచార మొనర్చిరి. బండ్లయందే ప్రయాణముచేసిరి. కారాగృహముల కేగిరి.

అట్టి యాంధ్ర స్త్రీలలో ప్రప్రథమస్థాన మలంకరింపఁదగినవారు శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు. వీరిది గుంటూరు. వీరు బెజవాడ, ఏలూరు, రాజమండ్రి, నెల్లూరు మున్నగుతావుల తిరిగి ప్రచార మొనర్చిరి. మరియు నుపన్యాసముల నిచ్చియు, విద్యార్థుల చేత సమ్మెలఁజేయించియు మిగుల సేవఁజేసిరి. వీరు మూడుసారులు కారాగృహమున కేగిరి. తరువాత పేర్కొనదగినవారు మాగంటి యన్నపూర్ణాదేవిగారు (ఏలూరు), బ్రహ్మజోస్యుల లక్ష్మీనరసమ్మగారు (రాజమండ్రి), పొణకా కనకమ్మగారు (నెల్లూరు), గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు, యామినీ పూర్ణ తిలకమ్మగారు.

ఇట్టి యాంధ్రసతీమతల్లుల నప్పుడప్పుడు తలచి కొనియాడుటయే యాంధ్ర మహిళలమగు మన కర్తవ్యము.



# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యస్. కేసరి.

ఉద్యోగమునకై చేసిన పలువిధములైన ప్రయత్నములు విఫలములైన పిమ్మటనే వైద్యమును నేర్చుకొనుటకు ప్రారంభించితిని అని ఇదివరకే చెప్పియున్నాను. ఇప్పుడా అవాంతరావస్థ వివరింతును.

చల్లనితల్లి నరసమ్మగారి చేతిప్రసాదముతో నాకు కాలము గడుచు చున్నది. కాని ఆమెమాత్రము నా కెంతకాలము భోజనం పెట్టగలదు? అనాథవద్ద ఉచితముగా భోజనంచేయుట నాకే అవమానముగ తోచినది.

ఆ కాలమున మద్రాసులో తెలుగు బోయీలు చాలమంది యుండెడివారు. వారు మద్రాసు బ్యాంకి, నేషనల్ బ్యాంకి, ఆగ్రాబ్యాంకి మొదలైన బ్యాంకులలో నౌకర్లుగా నుండేవారు. అప్పుడు మద్రాసుబ్యాంకి బ్రాడ్వేలోను, నేషనల్ బ్యాంకి ఆగ్రా బ్యాంకీలు ఆర్మీనియన్ వీధిలోను ఉండేవి. అక్కడ కొలువుచేసే బోయీ లందరు ప్రతి ఆదివారము నావద్దకువచ్చి వారిబంధువులకు జాబులు వ్రాయించుకొని పోయేవారు. కార్డువ్రాసిన అర్ధణా; కవరువ్రాసిన ఒకఅణా ఇచ్చేవారు. ఈ ప్రకారము నాకు ప్రతి ఆదివారము కొంతడబ్బు వచ్చుచుండెను.

వైశ్యుల ఇండ్లలో పిల్లకాయలకు పాఠములు చెప్పుటవల్ల కొంతడబ్బును సంపాదించుచుంటిని. ఈ సంపాద్యము లాధారముగా నరసమ్మగారికి నెలకు రు 3-0-0 లు చొప్పున ఇచ్చుచు భోజనము చేయుచుంటిని.

కోమట్ల ఇండ్లలో పిల్లకాయలకు పాఠములు చెప్పుటవలన వార్ల పరిచయము నాకు అధికమైనది. ఆ చనువున వారు అప్పుడప్పుడు నాకు కొన్ని పనులుచెప్పి చేయించుకొను చుండిరి. ముఖ్యముగా నాయిండ్ల ఆడువారు తమతమ బంధువులఇండ్లకు నన్నుపంపి,

వారియింట్లో యేమేమికూరలు, ఫలహారములు చేసుకొన్నదిన్నీ, వచ్చే ఆదివారమునాడు ఆళ్వారు శెట్టిగారింట్లో జరుగబోవు పెండ్లికి ఆయింటి భాగ్యశాలి యేమిచీరె కట్టుకొని రాదలచినదిన్నీ - మొదలుగాగల వర్తమానములను తెలుసుకొని రమ్మనేవారు. ఈసమాచారములు తెలిసి రాగలిగినందుకు వారు నాకు అప్పుడప్పుడు డబ్బును, వస్త్రములను బహూకరించుచుండెడివారు. వీరి పరిచయమువల్ల క్రమముగ నాకు అన్న వస్త్రముల కరువుతీరినది. వైద్యమును నేర్చుకొన్నపిదప ముఖ్యముగ ఈ కోమట్లఇండ్లలో హెచ్చుగా వైద్యముచేయుట కవకాశము కలిగినది. వీరు నాకు రాజపోషకులైరి.

పిమ్మట వారి సహాయ్యమువనే శ్రీ కన్యకా పరమేశ్వరీ ఆయుర్వేద ధర్మవైద్యశాలలో నౌకరిని సంపాదించుకొంటిని. ఏలననగ ఈ ధర్మవైద్యశాల కోమట్ల కులదేవతయగు శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవాలయపు ధర్మకర్తలచే స్థాపింపబడినది. ఈ దేవాలయములో ప్రతిదినము పేదబ్రాహ్మణ విద్యార్థులకు, అన్నమును పెట్టుచుండిరి. ఆ కాలమున వైశ్యులకు బ్రాహ్మణభక్తి ఇప్పటికన్న అధికముగా నుండుటచే అన్నదానము ధారాళముగా జరుగుచుండెను.

ప్రతి సంవత్సరమును శరన్నవరాత్రములలో ఉత్సవములకు ఈ కన్యకా పరమేశ్వరీ దేవాలయమున 9 దినములు బ్రాహ్మణసంతర్పణ జరుగును. ఈసంతర్పణలలో ప్రతిదినము 2000 బ్రాహ్మణులకు తక్కువలేకుండా భోజనమును చేయుచుండిరి. ఇక్కడ తయారు చేయు భోజన పదార్థములు, వంకాయకూర, చారు వగైరాలు చాలా ప్రశస్తములుగా నుండెడివి. ఇట్టి అద్భుతపాకకళానిపుణులలోముఖ్యముగా బుర్రా కుటుంబయ్యగారు, భీమవరం కాపురస్తులగు ములుకుట్ల సుబ్బయ్య, జాలయ్య, అప్పయ్య. వీరు యెన్నదగినవారు. ఇందులో జాలయ్యగారు మంచి కసరత్తుచేసిన వస్తాదు. కొల్లాకన్నయ్య శెట్టిగారితోకూడ గరిడీని నేర్చుకున్నవారు. వారారోజులలో ఆ తొమ్మిదిరోజులకు 1116 ర్లు తీసుకొనేవారు. జిహ్వాచాపల్యము తీర్చుకొనుటకై అమ్మవారి ప్రసాదమని అభ్యంతరము లేకుండా ఆనాటి గొప్ప యిండ్లవారుకూడా ఏదోయొక రోజున పంక్తి భోజనమునకు వచ్చేవారు. ఏ కారణముచేనైన రాజాలని పెద్దలు - ఆ ప్రసాద మంచలి తీపిచే ఇండ్లకైన తెప్పించుకొని భుజించేవారు.

నేను దేవాలయమునకు సంబంధించిన నౌకరి నగుటచే ఆ తొమ్మిదిరోజులు వంటశాల భోజనశాలలకు, నన్ను సూపరింటెండెంటుగా నియమించేవారు. ఈ వంటశాలలోని నెయ్యి, బియ్యము, చక్కెర, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, ద్రాక్ష వగైరా వెలగల సామానులు సామాన్యముగా చోరీ అగుచుండేవి. ఆచోరీలు జరుగకుండా జాగ్రత్తగా చూచుట, వంట చక్కగ చేసి వడ్డన శ్రద్ధగాజరుపుట మున్నగు కార్యములను గమనించుట నా పనులుగా నుండెడివి. ఎంతజాగ్రత్తగ నుండినను చోరీలు జరుగుచునే యుండెడివి. కొన్నిదొంగతనముల చమత్కారములిచ్చట వ్రాయించెదను. బియ్యమును దొంగలించువిధము: ఒక పెద్దగంపకు సగమువరకు బియ్యమునుపోసి, దానిపైన భుజించిన ఎంగిలి ఆకులనునిండుగ కప్పినింపి, ఆగంపను బయటికిపంపుట; నేయి దొంగలించువిధము: పేరిన నేయిని తప్పెలలోబోసి దానిపైన బియ్యపు కడుగునుపోసి, పశువుల కుడితియని బయటికి సాగనంపుట; కుంకుమపువ్వువగైరా చిన్నివస్తువుల దొంగతనము: పొట్లాలుగట్టి భోజనములకువచ్చిన ఇతరులచేతికి రహస్యముగానిచ్చి బయటకు దాటించుట. ఇట్లే అనేకమగు ఉపాయములు! ఈ వుద్యోగమువలన నాకు పాకకళ చక్కగ అంటినది.

విజయదశమినాడు అమ్మవారికి గొప్పపార్వేట ఉత్సవము జరుగును. ఆనాడు అమ్మవారికి వజ్రములతో చెక్కబడిన అనేక ఆభరణముల నలంకరించి వూరేగించెదరు. మామూలుగా అమ్మవారు గిడ్డంగివీధి అనే వరదాముత్తియప్పన్ వీధిగుండపోవుట ఆచారము. ఈ వీధిలో విస్తారము మహమ్మదీయుల గుడ్డలగిడ్డంగులే. అప్పుడే ఆవీధి నడుమనొక మసీదునుకూడ కట్టించియుండిరి. విజయదశమినాడు అమ్మవారు ఆవీధిగుండ యూరేగునని తెలియును. అనాడు అమ్మవారు కొత్తగగట్టిన మసీదుముందుగ పోవుట తెలిసి—అమ్మవారు అక్కడకువచ్చినంతనే, మోతగాళ్లను ముందుకొట్టి, పిమ్మట అమ్మవారిని క్రిందపడవైచి, అమ్మవారుధరించిన నగలనన్నిటిని తీసుకొని పోవచ్చుననేతలంపుతో, వందలకొలది మహమ్మదీయులు, లాటీలతో బారులుదీరి మసీదునకు సమీపమున నిలబడియుండిరి. క్రొత్తగగట్టిన మసీదునిండుగ తురకలుచేరియుండిరి. ఆనాడు తురకలు దుర్మార్గము చేయుదురనే, విషయం దేవస్థానం ధర్మకర్తలకు కొద్దిగ తెలిసి పోలీసుసిబ్బందితో అమ్మవారి ఉత్సవమును సాగించిరి. అమ్మవారివెంటవచ్చు పోలీసుసిబ్బందిలో ముఖ్యులు

వెల్డన్ (Weldon) యను దొరగారు. ఆయన ఆకాలమున పోలీసుశాఖలో పేరుపొందిన వారిలో నొకరు. వీరితోకూడ మరి ముగ్గురు సార్జంటులు గుఱ్ఱములనెక్కి ముందు నడచుచుండిరి. అమ్మవారికి ముందుగా ముఖ్యధర్మకర్తలగు శ్రీ కొల్లా కన్నయ్యశెట్టిగారు, వారి చుట్టును ఇతరట్రస్టీలగు వైశ్యులును నడచుచుండిరి. వారివెనుక దేవస్థానపు నౌకర్లు. వారిలో నేనును, పండితగోపాలాచార్యులు మున్నగువారు నుంటిమి. ఆకాలమున అమ్మవారితోకూడ దివిటీలను పట్టుటకు 'సోమరివాండ్లు' అనియొక వర్గముండేవారు. వారు ఇనుపత్రిశూలములకు బిగించిన కఱ్ఱలనుతీసికొని—ఆత్రిశూలములకు పాతగుడ్డలను గుండ్రముగాచుట్టి, నూనెలోతడిపి దివిటీలను వెలిగించి వెలుతురు చూపుచు వెంట నడిచేవారు.

ఆనాడురాత్రి 10 గం॥ లైనది. ఉత్సవము గిడ్డంగివీధిలో సాగినడచుచున్నది. ముందునడచుచున్న పోలీసు సార్జంట్లు నలుగురు బారులు తీరియున్న తురకలను సమీపించిరి. తోడనే, ఆతురకలు సార్జంట్ల గుఱ్ఱములను లాటీలతోగొట్టిరి. వెంటనే సార్జంట్లు తురకలమీదికి గుఱ్ఱాలదుమికించిరి. ఆతురకలవ్యూహ చెదరిపోయిరి. మశీదులోదాగియున్న తురకలు నల్లరాళ్లనుతీసికొని దొరలపై రువ్విరి. ఒకరాయి వెల్డన్‌దొరగారి కణతకుతగిలి రక్తముకార నారంభించినది. వెంటనే ఆదొర తనచేతిరుమాలుతో తలకు కట్టుకట్టుకొని కోటకుపరుగెత్తి సోల్జర్లను పిలుచుకొనివచ్చి ఆగిడ్డంగివీధి రెండుమార్గములను బందుచేసి ఎవరిని ఆవీధివిడిచి బయటికిపోకుండ జేసెను. ఈలోపల కొందరుతురకలువచ్చి అమ్మవారిని పడద్రోయుటకు ప్రయత్నించిరి. దివిటీలనుపట్టు సోమరివాండ్రు కన్నయ్యశెట్టిగారి కేమికీడు మూడునోయని వారిచుట్టుమూగిరి. అప్పుడాయన తన కేమైనను ఫరవాలేదని వారిని హెచ్చరించి, కర్తవ్యమును సౌజ్ఞచేయగానే వారు తమచేతిలోనున్న దివిటీలతో దురుసు చేయవచ్చిన తురకల గడ్డములకాల్చియు, త్రిశూలముల పొడిచియు తరిమివేసిరి. కాగడాలకును గడ్డములకును పోరాటము జరుగుట ప్రారంభించినవెంటనే గిడ్డంగులుకూడా తగులబడునేమోయని భయపడి తురకలందరు ఇండ్లలోకిపోయి, తలుపులుమూసికొనిరి. ఈసమయమున నాకొకభీతికలిగెను. నాప్రక్కనేయుండిన గోపాలాచార్యులువారికికూడ పొడుగుపాటి గడ్డముండెను. పొరపాటు జరుగునేమోయని చాలాజాగ్రత్తగా యుంటిని. అయితే వారుధరించియుండిన దిట్టమైన నామమే వారిని ఆనాడుకాపాడినది.

అమ్మవారిని క్రిందపడవేసి నగ లపహరింతమని యుద్దేశించిన తురకల అభిలాష విఫలమైనది. అమ్మవారు తిన్నగా సురక్షితముగా దేవాలయము చేరుకున్నది. పిమ్మట ఆరాత్రి అంతయు పోలీసువారు ఇండ్లలోను, మసీదులోను, దాగుకొనిన తురకల నందరి నరెస్టు చేసి పోలీసు స్టేషను లన్నిటిని ఆరాత్రియే నింపివేసిరి. పిమ్మట కోర్టులో చాలా కాలము వీరికేసుల విచారణ జరిగినది. సమయస్ఫూర్తి గల కన్నయ్య శెట్టిగారి కోమటి యుక్తివల్ల కాలిన గడ్డములు, కల్గిన త్రిశూలపు గాయములు నేరస్థులగు తురకల నిరూపించి అరెస్టు చేయుటకు చాలవరకు సహాయకారు లయ్యెననిరి.

వైద్యశాలలో నేనుచేయుచున్న నౌకరివల్ల నా వైద్య వృత్తికి కూడ మెరుగు వచ్చినది. అప్పుడు నాజీవితములోని కష్టములు చాల భాగము మరుగైనవి. గోపాలాచార్యులవారికిని నాకును మంచిస్నేహము కుదిరినది. గోపాలచార్యులుగారు మద్రాసుకు క్రొత్తయగుటచే నేనువారికి కొంతసహాయమును చేయవలసి వచ్చినది. మొదట వైద్యశాల గిడ్డంగి వీధిలో దేవాలయమునకు సంబంధించిన కొట్లలో యుండెను. ఈ వైద్యశాల యెదుటనే నాస్నేహితుడగు అన్నం చెన్నకేశవులు శెట్టిగారి యిల్లు. గోపాలాచార్యులుగారు నివసించుటకు స్థలము లేనందున శెట్టిగారి యింట్లో, ఒకరూమును ఆచార్యుల వారికి యిప్పించితిని. అప్పుడు నేను నరసమ్మగారికి నెలకు రు 10 లు ఇచ్చి భోజనము చేయుచు రాత్రిళ్లు శెట్టిగారి యింటిలోనే పండుకొనుచుంటిని. ఆచార్యులవారు, నేను, యిరువురము శెట్టిగారి యింట్లోనే యుండుట తటస్థించెను. మద్రాసులో వైద్యవృత్తికి కొంత డంబముండ వలయును. ఆడంబము ప్రదర్శించుటకు డబ్బుకావలయును. ఆచార్యుల వారికి వైద్యశాలలో జీతము రూ 30 లు మాత్రమే. అందువల్ల శెట్టిగారితో చెప్పి వారికి కొంతడబ్బు అప్పు ఇప్పించితిని. క్రమముగా వారు మద్రాసులో కొంతపేరు సంపాదించు కొనిరి.



# వచ్చిందోయ్ వచ్చిందీ



శ్రీమతి చిల్కపాటి అమ్మణ్ణిగారు



శ్రావణమాసం వచ్చిందీ
నోములపండుగ వచ్చిందీ
వచ్చిందోయ్
వచ్చిందీ.

గుమ్మాలను పూజించామూ
పసుపూగుంకాల్ బెట్టేమూ
పచ్చనితోరణాల్ గట్టేమూ
కట్టేమోయ్
కట్టేమూ.

నలుగూ రన్నదమ్ములకూ
నేను కూడా బుట్టేనూ,
పుట్టేనోయ్
పుట్టేనూ.

చీరలు రవికలు దెస్తారూ
పండ్లూ పూలూ దెస్తారూ
నగలూ నాణ్యా లిస్తారూ
ఇస్తారోయ్
ఇస్తారూ.

చుట్టాపక్కాలొస్తారూ
మంచీ కాన్కల్ దెస్తారూ
సందడి సరదా చేస్తారూ
చేస్తారోయ్
చేస్తారు.

పొద్దూపొద్దున లేస్తామూ
మంగళస్నానాల్ జేస్తామూ
పసుప్గా గౌరిని బెడతామూ
భక్తిపూజల్ జేస్తామూ
చేస్తామోయ్
చేస్తామూ.

ఇంటింటీ గృహలక్ష్ములకూ
పాదపూజలు చేస్తానూ
భక్తిసేవల్ జేస్తానూ
మూసీవాయ్‌నా లిస్తానూ
ఇస్తానోయ్
ఇస్తానూ.

చక్కని మగని సామేనా
గౌరీదేవీ చెందానా
అష్టైశ్వర్యాలందమనీ
అష్టేదీవన లిస్తారూ ఇస్తారోయ్
ఇస్తారూ.

చిట్టీపట్టీ గౌరమ్మా
సిరిసంపదలా నీవమ్మా
నిన్నూ గొల్చిన కన్నెలకు
పట్టిందెల్లా బంగారూ
ముట్టిందెల్లా ముత్యాలూ ముత్యాలోయ్
ముత్యాలూ.

కోరినకొండలు గురిసేనూ
తీరని కోర్కులు దీరేనూ
మంగళగౌరీ మాతల్లీ
మమ్ముల దయగన వచ్చిందీ
వచ్చిందోయ్
వచ్చిందీ.